భారతీయ సాహిత్య నిర్మాతలు

# బి. ఎం. శ్రీకంఠయ్య

ఆంగ్ల మూలం:

ఎ. ఎస్. మూర్తి రావు

తెనుగుసేత:

పోరంకి దక్షిణామూర్తి



సాహిత్య అకాదెమీ

న్యూఢిల్లీ

# తొలి పలుకు

నేను బి. ఏ., ఎం. ఏ. తరగతుల్లో చదివే రోజుల్లో కీ॥ శే॥ బి. ఎం. శ్రీ కంఠయ్యగారు మాకు అధ్యాపకులు. ఆయన చెప్పిన ఎన్నో విషయాలూ, ఆయన చేసిన ఎన్నో పనులూ నా జీవితం మీద శాశ్వతమైన ముద్ర వేసినందువల్ల, ఒక రకంగా నేను ఆయనకు ఎప్పటికీ శిష్యుణ్ణే అని చెప్పాలి. ఆయన మూర్తిమత్త్వాన్నీ ఆయన కృషినీ పరిశీలించడానికి ఈ గ్రంథంలో కొంత ప్రయత్నం చేశాను. విషయ ప్రాధాన్యంతో చేసే పరిశీలనకు ఆయన ఎంతో విలువ ఇచ్చేవారు. ఈ గ్రంథంలో నేను దాన్ని సాధించానని తలుస్తాను.

ఇందులో, జీవితకథకు సంబంధించిన కొంత సమాచారం నేకరించ డానికి నాకు తోడ్పడ్డ గ్రంథం, ప్రొఫెసర్ ఎస్. వి. రంగణ్ణ వ్రాసిన 'బి. ఎం. శ్రీ కంఠయ్య'. దీన్ని మైసూరు విశ్వవిద్యాలయంలోని కన్నడ అధ్యయన సంస్థవారు ప్రచురించారు. వీరికి నా కృతజ్ఞతలు.

ఉదాహరణాత్మకంగా నేను ఇంగ్లీషులో ఇచ్చిన భాగాలు పద్య రూపంలో అనువాదం చేయవలసినవి కావు.

కన్నడ సాహిత్య చరిత్రలో నూతన శకాన్ని స్థాపించిన ఉద్యమ నిర్మాత జీవితాన్నీ కృషినీ పునరాలోకనం చేసుకొనే అవకాశం నాకు ఇచ్చినందుకు సాహిత్య అకాదెమీ వారికి కృతజ్ఞుణ్ణి.

న్యూఢిల్లీ
23 అక్టోబరు 1974

ఎ. ఎన్. మూర్తి రావు

# విషయసూచిక

# 1

# జీవితం

ఈ శతాబ్ది రెండో దశకంలో కన్నడ సాహిత్యంలో కాల్పనికమైన తిరుగుబాటు ఉద్యమం అన్నది వచ్చింది. నిజానికది తిరుగుబాటుకంటె ఎక్కువే–అదొక గొప్ప సృజనాత్మకోద్యమం. అయితే దీన్ని గురించి చెప్పా కొనేటప్పుడు మనం ముందుగా ఏ విధమైన సూచనలూ లేకుండా ఏర్పడిన హఠాత్సంఘటన అన్న ధోరణిలో తరచు మాట్లాడుతూ ఉంటాం. వాస్త వానికి, అటువంటి సందర్భాలన్నిటిలోనూ, అస్పష్టమైన అసంతృప్తులతోనూ అవ్యవస్థితమైన ఆకాంక్షలతోనూ అనిశ్చితమైన ఒకానొక వెలుగురేకవైపు తడుముకుంటూ పోయేవాళ్ళవల్ల కొంత ప్రాథమిక కృషి జరుగుతూ ఉంటుంది. అయితే ఆ మాదిరి ప్రయత్నాలు వాటంతట అవి శాశ్వతముద్ర వెయ్యలేవు. కాని తరవాత, భావనాబలసంపన్నుడైన ఒక మహాపురుషుడు ఆవిర్భవిస్తాడు. ఒక్క చూపులోనే అతడు పరిస్థితిని ఆకళించుకుంటాడు; పనిచేస్తున్న శక్తులన్నిటికీ పరస్పర సంబంధ మేర్పరుస్తాడు. సుస్పష్టంగా దర్శించిన గమ్యంవైపు విజయవంతంగా సాగిపోతాడు. కన్నడ సాహిత్యానికి ఈ విధమైన సేవచేసే అవకాశం బి. ఎం శ్రీకంఠయ్యగారికి లభించింది

బి. ఎం. శ్రీకంఠయ్యగారు 1884 జనవరి 3 వ తేదీన కర్నాటక రాష్ట్రంలో ఉన్న సంపిగె గ్రామంలో జన్మించారు. ఈయన తల్లిదండ్రులు–భగీరథమ్మగారు, బెళ్లూరు మైలారయ్యగారు; వీరిద్దరూ సాంప్రదాయికమైన మధ్యతరగతి కుటుంబాల్లో పుట్టి పెరిగినవాళ్ళే. మైలారయ్యగారు మంచి పేరొందిన వకీలు. ఆయన మైసూరు నగరానికి తొమ్మిదిమైళ్ళ దూరంలో ఉన్న శ్రీరంగపట్టణమనే చిన్న పట్నంలో ప్రాక్టీసు చేస్తూ ఉండేవాడు.

శ్రీకంఠయ్యగారు ఐదుగురు సంతానంలో పెద్దవారు. చిన్నతనంలో ఆయన బాగా అల్లరిచిల్లరిగా తిరిగినట్టనిపిస్తుంది ఎక్కువగా పండ్లతోటలమీద దాడి చేసేవారట. ఆయనకి చిన్నప్పటి చదువు శ్రీరంగపట్టణంలో సాగింది. తరవాత సెకండరీ విద్య, ఉన్నత విద్య అభ్యసించడానికి మైసూరు పంపడం జరిగింది. ఆర్ట్సులో మొదటి పరీక్ష (ఎఫ్. ఏ.) ప్యాసయిన తరువాత ఆయన, సెంట్రల్ కాలేజిలో చదవడానికి బెంగుళూరు వెళ్ళారు 1903 లో బి. ఏ. పట్టం తీసుకున్నారు.

ఆ రోజుల్లో సెంట్రల్ కాలేజిలో స్నాతకోత్తరస్థాయి పట్టపరీక్షల కోర్సులేవీ బోధించేవారు కారు. అందుచేత పై చదువులకోసం ఆయన మద్రాసు వెళ్ళవలసి వచ్చింది. 1907 లో ఎం. ఏ. డిగ్రీ తీసుకున్నారు. 1906 లో న్యాయశాస్త్ర పట్టం తీసుకున్నారుకాని, వకీలుగా ప్రాక్టీసు చెయ్యాలన్న ఉద్దేశమేమీ ఆయనకు ఉన్నట్టులేదు. మైసూరు సివిల్ సర్వీసు పరీక్ష వ్రాశారు. అయితే కన్నడ సాహిత్యం చేసుకున్న పుణ్యంవల్ల, ఆ పరీక్షలో ఆయనకి ఉన్నతశ్రేణి లభించలేదు. ఆ విధంగా ఆయన కృషి, సాహిత్యానికి, కన్నడానికి దక్కింది. మద్రాసులో ఉన్న కాలంలో ఆయన కలలు కంటున్నది నిజానికి, సివిల్‌సర్వీసు గురించి కాదు. సాయంకాలాల్లో సముద్రపు ఒడ్డున ఇసకలో కూర్చుని, ఆయనా కొందరు స్నేహితులూ సాహిత్యాన్ని గురించి చర్చించుకుంటూ ఉండేవారు; కన్నడ సాహిత్యానికి పట్టిన దుఃస్థితికి విచారించేవారు; గ్రీకు విషాదాంతనాటకాల్నీ ప్లేటో-షేక్స్పియర్‌ల రచనల్నీ కన్నడిగుడికి స్వభాషలో అందించాలని కలలు కంటూ ఉండేవారు. ఆయన మనస్సులో మెదులుతూ ఉండే భావాలకు త్వరలోనే ఒక నిర్దిష్టరూపం ఏర్పడింది. ఎం. ఏ. డిగ్రీ తీసుకున్న సరిగా నాలుగేళ్ళకు, 1911 లో ధార్వాడలో ఆయన ఇచ్చిన ఉపన్యాసాన్ని[1] బట్టి, కన్నడ సాహిత్యం ఎదుర్కోవలసివచ్చిన సమస్యల్ని ఆయన భావస్ఫోరకంగాను, సుస్పష్టంగాను, నిష్పాక్షికంగాను విశ్లేషించడం, నూతన సాహిత్యసృష్టికి అనుసరించదగిన మార్గాన్ని రూపొందించడానికి చేయవలసిన పనికి ఒక ప్రణాళిక వెయ్యడం గమనిస్తాం.

---

1. 'కన్నడద మాతు తెళియెత్తువ బగ్గె' అన్న పేరుగల ఈ ప్రసంగం, మైసూరులో ఉన్న కావ్యాలయంవారు ప్రచురించిన 'కన్నడిగరిగె ఒళ్ళెయ సాహిత్య' అన్న పుస్తకంలో మొదటి అధ్యాయం.

1909 లో ఈయన్ని మైసూరులో ఉన్న మహారాజావారి కళాశాలలో ఆంగ్ల (–కన్నడ) అధ్యాపకులుగా నియమించడం జరిగింది. 1914 నాటికి ఈయన అసిస్టెంట్ ప్రొఫెసర్ అయ్యారు. అంతేకాకుండా, (ఇంగ్లీషులో) ఈయన మొట్టమొదటి గ్రంథం – 'ఏ హాండ్‌బుక్ ఆఫ్ రెటారిక్' అన్నది వెలువడింది. ఇది ఒక సంకలన గ్రంథంకంటె ఏమంత ఎక్కువ అనిపించుకోదు; ఇంతకుమించి దీన్నిగురించి ప్రస్తుతం చెప్పుకోనక్కరలేదు. అయితే దాదాపు ఈ కాలంలోనే ఈయన కృషి – అంటే, ఆంగ్ల భావగీతాల అనువాదం—మొదలుపెట్టి ఉండాలి. దీనికున్న చారిత్రక ప్రాముఖ్యాన్ని అతిశయోక్తిగా చెప్పడం సాధ్యంకాదు. ఆ రోజుల్లో దీన్నిగురించి ఎరిగినవాళ్లు లేరు. వీటిలో మొదటి మూడు పద్యాలూ మొదట వెలువడింది 1919 లోనే. అయితే ఆంగ్ల అధ్యాపకులుగా ఈయనకు అతి స్వల్పకాలంలోనే మంచి పేరు వచ్చింది. ఇది ఈయనకు ప్రత్యేకమైన సంతృప్తి కలిగించింది, దానికి గల కారణాలు తరవాత -మనవిచేస్తాను. కుటుంబజీవనం కూడా ఈయనకు సుఖంగానే సాగింది. హాయిగా కాపురంచేస్తూ ముగ్గురుపిల్లల తండ్రి అయారు– ఇద్దరు అమ్మాయిలు, ఒక అబ్బాయి.

అయితే, కొంచెం ఇంచుమించుగా ఆ రోజుల్లో, ఒకదాని వెంబడి మరొకటి రెండు సంఘటనలు సంభవించాయి – బహుశా తరవాత ఎన్నటికీ ఆయన్ని పూర్తిగా కోలుకోనివ్వని రెండు విషాద సంఘటనలవి. ఆయన కొడుకు తిమ్మయ్య, కండ్లకలకతో బాధపడుతూ ఉండేవాడు; వైద్యంలో ఏదో లోపం జరగడంవల్ల అతను గుడ్డివాడయిపోయాడు. తరవాత కొన్నాళ్లకే ఆయన భార్య పురిటిజ్వరం వచ్చి కన్నుమూశారు. వీటివల్ల కలిగిన బాధనంతనూ ఆయన ఎంతో స్థైర్యంతో ఓర్చుకున్నారు. అయితే ఆ స్థైర్యాన్ని సాధించడానికి ఆయన ఎంతో ఘర్షణకు గురికావలసి వచ్చింది. ఆయన జీవితంమీద మళ్ళీ ఒకసారి విధి దెబ్బతీసింది. అటు తల్లీ, ఇటు పడుచుప్రాయంలో ఉన్న అల్లుడూ ఒక్క రెండు వారాల వ్యవధిలో చనిపోయారు. ఆయనలో అప్పుడప్పుడు కనిపించే కటుత్వానికి కారణం, బహుశా సంసారంలో సంభవించిన దుర్ఘటనలే కావచ్చునని గమనించవచ్చు. ప్రొ॥ ఎస్. వి. రంగణ్ణగారు చెబుతూ ఉంటారు; శ్రీకంఠయ్యగారు తమకు స్వాభావికమైన పరిహాసధోరణిలో తమ సోదరితో ఇలా అంటూ ఉండే

వారట: "భగవంతుడు మనుషులవేపు చూపు సారించినప్పుడు - మంచి కయినా, చెడుకయినా - ఏది చెయ్యదలిచినా, ఆయన మొదట చూసేది నన్నేననుకుంటాను; మొట్టమొదట ఆయన కంటబడేది నేనే ....దేవుడికి ఇష్టమైనవాణ్ణి నేను."1

భార్య చనిపోయేనాటికి ఆయన వయస్సు ముప్పై, ముప్పై ఒకటి మాత్రమే. అయినా మళ్ళీ ఇక పెళ్ళి చేసుకోగూడదని నిశ్చయించుకున్నారు. సర్వాత్మనా జీవితకృషికే అంకితమైపోయారు. కన్నడానికి అర్హస్థానాన్ని సంపాదించి పెట్టడం (అప్పటివరకు ఆ స్థానాన్ని ఇంగ్లీషు ఆక్రమించుకుంది), సంప్రదాయ శృంఖలాల్లోనుంచి కన్నడానికి విముక్తి కలిగించి పునరుజ్జీవనాన్ని సాధించడం, కన్నడభాషా ప్రాంతాల్ని అన్నిటినీ ఒకే ప్రభుత్వం కిందికి తెచ్చి కర్నాటకరాష్ట్రస్థాపనకు కృషిచేయడం — ఇవన్నీ తమ జీవిత ధ్యేయంగా ఎంచుకున్నారు. వృత్తిరీత్యా ఆంగ్ల భాషాధ్యాపకులాయన. ఈ ఆంగ్ల సాహిత్యం ఆయన్ని ఐరోపా సాహిత్యానికీ, ప్రత్యేకించి గ్రీకు సాహిత్యానికీ పరిచయం చేసింది. ఆయన గ్రీకుభాష నేర్చుకున్నారని ఆషిలస్, సోఫక్లిస్‌ల రచనల్ని మూలంలోనే చదివి ఆనందించగల సామర్థ్యం ఉన్నవారనీ కూడా విన్నాను. ఆయన పాశ్చాత్య సాహిత్యాన్ని అధ్యయనం చేసింది, చదువుకొని ఆనందించడంకోస మన్నదాంట్లో సందేహం లేదు. అయితే ఆ అధ్యయనం, కన్నడ సాహిత్యంలో తాము చెయ్యదలిచిన కృషిని దృష్టిలో ఉంచుకొని చేసిన ప్రయత్నమన్నది కూడా అంతా నిజం. సంస్కృత తమిళ సాహిత్యాల్ని అధ్యయనం చేయడం విషయంలోకూడా అయన ఉద్దేశమిదే. ఈ శతాబ్ది రెండో దశకం, గాఢమైన అధ్యయనానికి ఆయనకు వినియుక్తమైన కాలం. ఈ అధ్యయనం, ఒక పవిత్రలక్ష్యాన్ని సాధించాలన్న స్పృహ, కర్నాటకదేశంపట్లా ప్రజలపట్లా సాహిత్యంపట్లా గాఢమైన అనురాగం – ఇవి ఆ కటుత్వాన్ని పరిహరించుకోడానికి ఆయనకు తోడ్పడ్డాయి. "కన్నడం ఎడారిపాలుకాకుండా కాపాడినవారు ప్రొ॥ బి. ఎం. శ్రీకంఠయ్యగారు" అని నేనొకసారి, మా స్నేహితుడు ప్రొ॥ బి. ఎన్. శ్రీకంఠయ్యతో అన్నప్పుడు, ఆయన, "కన్నడం కూడా ఆయన్ని కాపాడింది – ఆత్మదైన్యం పాలుకాకుండా చేసింది" అన్నాడు. ఇది అక్షరాలా సత్యం.

---

1. ఎస్. వి. రంగణ్ణ వ్రాసిన 'బి. ఎం. శ్రీకంఠయ్య' అన్న గ్రంథం, కన్నడ అధ్యయన సంస్థ, మైసూరు విశ్వవిద్యాలయం.

1909 లో ఆయన నియామకం జరిగినది, ఇంగ్లీషు కన్నడాలు రెంటి లోనూ లెక్చరరుగా. కేవలం కన్నడ భాషాధ్యాపకుడి కయితే, చెప్పుకోదగ్గ విద్యావిషయికమైన హోదా ఏమీ ఉండదనీ విద్యార్థుల గౌరవాన్ని పొంద లేకపోవడం నిశ్చయమనీ ఆయన భావించినట్టుంది: 1919లో అధికారులు ఆయన్ని, కన్నడంలో సీనియర్ ప్రొఫెసర్‌షిప్పు కావాలో, ఆంగ్లంలో జూనియర్ ప్రొఫెసర్ షిప్పుకావాలో ఎంచుకోమన్నారు. చిత్రమేమిటంటే, కన్నడంకోసం జీవితాన్ని అంకితంచేసిన శ్రీకంఠయ్యగారు, ఆంగ్లంలో జూనియర్ ప్రొఫెసర్ షిప్పే ఎన్నుకున్నారు. దానికో కథ ఉంది. ప్రొఫెసర్ ఎన్ ఎస్. సుబ్బారావుగారని, కేంబ్రిడ్జి డిగ్రీ తీసుకున్న స్నేహితుడొకాయన ఉండేవాడు ఆయనకు; ఆయన ఒకసారి ఇంగ్లండులో ఉన్న విశ్వవిద్యాలయం దేన్నించి అయినా డిగ్రీ తీసుకొని ఉండకపోతే, ఇంగ్లీషు డిపార్ట్ మెంటులో మీకు భవిష్యత్తు ఉండదని శ్రీకంఠయ్యగారితో అన్నారట. మామూలుగా అయితే ఆయన చెప్పింది నిజమే. ఆ రోజుల్లో, విశ్వవిద్యాలయాల్లో సుస్పష్టమైన క్రమానుగతశ్రేణి ఒకటి ఏర్పడి ఉండేది. ఇంగ్లీషు వాడు (లేదా యూరప్ వాడు) అందరికంటె పైన ఉండేవాడు; తరవాతి స్థానం, ఇంగ్లండు వెళ్ళి వచ్చిన వాడిది; భారతీయ విశ్వవిద్యాలయాల్లో చదువుకున్నవాడు ఎక్కడో కొట్టకొసకి మిగిలిపోయేవాడు. ఈ పరిస్థితి ఈ తీరుగా ఉండడం నచ్చని శ్రీకంఠయ్యగారు, తమ మిత్రుడు చేసిన వ్యాఖ్యని ఒక సవాలుగా తీసుకున్నారు 'ఇంగ్లండు వెళ్ళివచ్చిన వాడితోనే కాదు, అసలు ఇంగ్లీషు వాడితోనే, వాడి రంగంలోనే వాడితో తలపడా'లని తల పెట్టారు. తనకేమైనా పేరు వచ్చేటట్లయితే ఇంగ్లీషు ప్రొఫెసరుగానే రావాలి గాని కన్నడం ప్రొఫెసరుగా కాదు. కొన్నేళ్ళపాటు ఆయన, కన్నడ సభల్లో ప్రసంగించవలసినప్పుడు కూడా ఇంగ్లీషులోనే ప్రసంగించాలని పంతం పట్టారు. అందులో విజయం సాధించారు. ప్రథమశ్రేణి ఆచార్యపదవికి ప్రమోషను పొందడానికి చాలా పూర్వమే, ఆంగ్ల అధ్యాపకులుగా ఆయనకు వచ్చిన పేరు ఏ ఇంగ్లీషువాడికీ రాలేదు. శ్రీకంఠయ్యగారితోబాటు ఇంగ్లీషు డిపార్ట్‌మెంటులో పనిచేసే ఆక్స్‌ఫర్డ్ మనిషి ఒకాయన – ఆయనకు సీనియరు– ఒకసారి ఇలా అన్నాడు – "ప్రొఫెసర్ శ్రీకంఠయ్యగారు కనక ఇంగ్లండు వెళ్ళినట్లయితే, ఆయన్ని తిరిగి రానివ్వరు. ఆయన్ని ఆక్స్‌ఫర్డ్ చటుక్కున లాగేసుకుంటుంది."

ఎన్. ఎస్. సుబ్బారావుగారు అన్న మాటకు శ్రీకంఠయ్యగారికి కలిగిన పట్టింపు గురించి చెప్పుకొన్నది కొంతవరకు అతిశయోక్తేమో అనిపిస్తుంది. ఇంగ్లీషు డిపార్టుమెంటులో ఉద్యోగం చెయ్యాలన్న ఆయన నిశ్చయానికి కారణమైంది కేవలం సుబ్బారావుగారి ఎత్తిపొడుపుకాదు; ఎంతో పరిశీలించిన మీదట కలిగిన జ్ఞానం. ఇంగ్లీషు ప్రొఫెసరుగా అయితే తమకు ఎక్కువ ప్రతిష్ఠ ఉంటుంది; తమ మాటకు ఎక్కువ విలువ ఉంటుంది. కనక, కన్నడానికి ఇంతకంటె ఎక్కువ సేవ చెయ్యగలుగుతానని ఆశించారు. 1926 లో రిజిస్ట్రారు పదవి చేబట్టడానికి కూడా అదే కారణం. ఈ పదవీకాలంలోనే ఆయన కృషిఫలితంగా కన్నడానికొక ఆచార్య పీఠం ఏర్పరచడం జరిగింది. అంతేకాక, కన్నడంలో ఎం. ఏ. తరగతి ప్రారంభించారు. రిజిస్ట్రారుగా నిర్వహించవలసిన విధులకు తోడు ఆయన కన్నడానికి గౌరవాచార్యులుగా కూడా పనిచేస్తూ ఉండేవారు. మైసూరు యూనివర్సిటీ పబ్లికేషన్స్ సిరీస్ పేరిట వరసగా కొన్ని పుస్తకాలు ప్రచురించడానికి యూనివర్సిటీ చేత డబ్బు మంజూరు చేయించారు. ఆ ప్రచురణలకు తామే సంపాదకులుగా పనిచేశారు మరుగుపడ్డ మాణిక్యాల్ని వెలికి తీశారు. ప్రాచీన కన్నడ గ్రంథాల కూర్పులు, సాహిత్య విమర్శ, పాశ్చాత్య సాహిత్య అనువాద గ్రంథాలు, సంప్రదింపు గ్రంథాలు, సాహిత్యేతరమైన తత్త్వశాస్త్ర, సాంఘికశాస్త్రాది విషయ ప్రధానమైన గ్రంథాలూ ఈ సిరీస్‌లో ప్రచురితమయాయి. కొత్త రచయితల్ని ప్రోత్సహించడంకోసం ప్రతి సంవత్సరం, ఉత్తమ కవిత వ్రాసిన విద్యార్థికి బంగారు పతకం బహూకరించడానికి ఏర్పాటు చేశారు. తత్త్వశాస్త్ర విభాగంలో పని చేసే-ఆయన శిష్యుల్లో ఒకరైన శ్రీ జి. హనుమంతరావు యూనివర్సిటీ టీచర్స్ ఎసోసియేషన్ స్థాపించారు. ఈ ఎసోసియేషన్ సభ్యులు ఏడాదికి రెండుమూడుసార్లు గ్రామీణ ప్రాంతాలకు వెళ్ళి, ఒక వారంరోజులపాటు అక్కడ మకాంచేసి, అంతకుముందు ఎన్నడూ కన్నడంలో చెప్పని విషయాల్ని గురించి గ్రామప్రజలకు కన్నడంలో ఉపన్యాసాలు ఇస్తూ ఉండేవారు. ఉదా ॥ పన్నులు, కుటుంబజీవనం, కండ్లగురించి తీసుకోవలసిన జాగ్రత్తలు, శరీరపోషణ మొదలైనవి. ఈ ప్రసంగాల్ని పుస్తకరూపంలో ప్రచురించి-ఒక రూపాయకు ఎనిమిది పుస్తకాల చొప్పున నామ మాత్రపు ధరకు అమ్మారు. ఈ పనికి చొరవ తీసుకున్నవారు శ్రీ జి హనుమంతరావు. అయితే

ఆయన కూడా శ్రీకంఠయ్యగారు పెంచి పోషించిన నవచైతన్యంలో ఉద్భవించినవారే.

1930లో ఆయన్ని సీనియర్ ప్రొఫెసరుగా ప్రమోట్ చేసి బెంగుళూరులో సెంట్రల్ కాలేజికి బదిలీచేశారు. 1942లో పదవీ విరమణ చేసే వరకు ఆయన అక్కడే పనిచేశారు. అక్కడికి వెళ్ళిన వెంటనే ఆయన 'ది ఇంగ్లీష్ సెమినార్' అన్నది ప్రారంభించారు. ఈ పేరు చూస్తే పొరపాటు పడ్డానికి అవకాశముంది. ఎందుచేతనంటే, ఈ సెమినారు (సదస్సు) కేవలం ఇంగ్లీషుకే పరిమితమైనది కాదు. ఇందులో సాంస్కృతికాభిరుచి కలిగించే విషయాలన్నిటినీ చర్చించేవారు. సైన్సు డిపార్ట్‌మెంట్లవారితో సహా ఎందరో విద్యార్థులూ అధ్యాపకులూ ఆకర్షితులయేవారు. కాని మొత్తానికి, శ్రీకంఠయ్యగారికి బెంగుళూరు వాతావరణం అంతగా అనుకూలంగా కనిపించినట్టు లేదు.

ఆయన రచనలు దాదాపు అన్నీ, 1926 కూ 1935 కూ మధ్యలో వెలువడినవే. ఆయన ఇంగ్లీషు గీతగళు (కొన్ని ఆంగ్ల గీతాల అనువాదం) అన్న పుస్తకం 1926 లో ప్రచురితమైంది. దీని ప్రభావాన్ని, ఇంగ్లీషులో 'లిరికల్ బాలడ్స్' కున్న ప్రభావంతో పోల్చడం సమంజసం. గదాయుద్ధనాటకం అనే పద్యనాటకం కూడా 1926 లో వెలువడింది. ఆయన రచనల్లో అన్నిటికన్న మహత్తరమైన 'అశ్వత్థామన్' 1929 లో వెలువడింది. ఈ విషాదాంత నాటకం, కొంతవరకు సోఫక్లిస్ 'అయాస్' నూ కొంతవరకు మహాభారతాన్నీ ఆధారం చేసుకొని వ్రాసినది. 1935 లో 'పారశీకరు' వెలువడింది. ఇది ఆషిలస్ వ్రాసిన 'పెర్సే' కు అనువాదం. 1936 లో మైసూరు విశ్వవిద్యాలయంవారు ప్రచురించే 'హాండ్‌బుక్ ఆఫ్ కన్నడ' అన్న సంపుటిలో ప్రచురించే నిమిత్తం 'ఎ షార్ట్ హిస్టరీ ఆఫ్ కన్నడ ప్రొసడీ' అన్న వ్యాసం వ్రాశారు. కన్నడ సాహిత్య చరిత్ర వ్రాయడానికి శ్రీకంఠయ్యగారు ఒక ప్రణాళిక వేసుకొని, అందులో కొంత భాగం వ్రాశారు కూడా. పైన పేర్కొన్న హాండ్ బుక్కులో ఇదో విభాగం. అప్పుడప్పుడు సందర్భవశాత్తు వ్రాసిన పద్యాల్ని సంకలనంచేసి హొంగన సుగళు (బంగారు కలలు) అన్న పేరుతో 1943 లో ప్రచురించారు. తరవాత అయిదేళ్ళకి, అంటే 1948 లో, కన్నడిగరిగె ఒళ్ళెయ

సాహిత్య (కన్నడిగులకోసం చక్కని సాహిత్యం) అన్న గ్రంథం ప్రచురిత మైంది. ఆయన చేసిన ప్రసంగాలు, వ్రాసిన సమీక్షలు, పీఠికలు మొదలైనవి సంపుటి ఇది. శుద్ధ సాహిత్యాభిమానిగా కనక చూస్తే, రచయితగా శ్రీకంఠయ్యగారి వ్యాసంగం, 1935 లో ప్రచురించిన పారశీకరుతో ముగిసిందని చెప్పవలసి ఉంటుంది. ఆ తరవాత ఆయన, వ్రాయడం దాదాపు మానుకొన్నట్టే.

ఒకరకంగా ఇది, ఎంతో విచారకరమైన విషయం; ఎందుచేతనంటే, ఆయన మాత్రమే వ్రాయగలిగిన విషయాలు కొన్ని ఉన్నాయి. షేక్స్పియర్ విషాదాంత నాటకాన్ని (షేక్స్పియర్ మోదాంత నాటకం విషయంలో అంత నమ్మకంగా చెప్పలేను) కాని, అరిస్టోఫియస్ ట్రిలజీనికాని ఆయనంత సమర్థంగా అనువదించడానికి తగిన కవి కర్నాటకంలో మరొక రున్నారని అనుకోను. షేక్స్పియర్ అంటే ఆయన కెంత అభిమానమంటే, అది దాదాపు ఆరాధనాభావనవరకు పోతుంది అయితే ఆయన ఒకసారి నాతో ఇలా అన్నట్టు గుర్తు: "విశ్వజనీనత విషయంలోనూ జీవితంలో వివిధాంశాల్ని స్పృశించడం విషయంలోనూ షేక్స్పియర్‌కు సాటి మరొకరు లేరు. కాని భారతీయులమైన మనకు, ఎందుకోగాని అతనికన్న గ్రీకులే దగ్గరివాళ్ళు అనిపిస్తారు." ఆషిలస్ వ్రాసిన 'ప్రామిథ్యూస్ బౌండు'ను షెల్లీ వ్రాసిన 'ప్రామిథ్యూస్ అన్ బౌండ్'ను ఆధారం సామగ్రిగా తీసుకొని ఒక నాటకం వ్రాయడానికి ప్రణాళిక వేసుకున్నా రాయన. "ముసలివాడి గడ్డాన్ని పడుచువాడి మీసాలకి మెలేసి దానిమీద ఉయ్యాలలూగాలి" అన్నారొకసారి ఆయన. చమత్కారానికి, ఈ నాటకాన్ని పూర్తిగా స్వతంత్ర రచనగా రూపొందించాలని ఆయన సంకల్పం; అందుచేతనే 'మాతారిశ్వన్' అని పేరు పెట్టడం జరిగింది. ఈ నాటకానికి వేదకథల్లో రెండు ఆధారాలు దొరికాయి. దీన్ని ఒకటి రెండు దృశ్యాలవరకు వ్రాసినట్టు కూడా విన్నాను. దీన్ని ఆయన పూర్తిచెయ్యలేదు. షేక్స్పియర్, గ్రీకు విషాదాంత నాటకాల్ని కన్నడంలోకి తీసుకురావాలని ఆయన కన్న కల కొంతవరకే నిజమైంది.

అయితేనేమి, ఆయన కన్నడ సాహిత్యాన్ని పూర్తిగా విడిచిపెట్టేశారనడం తప్పు. 1935 తరవాత ఆయన ఎక్కువగా ఏమీ వ్రాయలేదు. కాని ప్రసంగాలు చాలా చేశారు. ఆయన ప్రసంగాల్లో తరచుగా వినవచ్చేది

సాహిత్యమే. ఆశుధారగా ఆయన చేసిన ప్రసంగాలు అచ్చమైన తియని కన్నడ భాషలో అహ్లాదకరంగా, సంగీతభరితంగా, హృదయానికి సన్నిహితంగా ఉంటుండేవి. తనకుగల వక్తృత్వనైపుణ్యాన్ని వినియోగించే సందర్భాలు ఆయనకు చాలా తరచుగా వస్తుండేవి; ఇది ఆయనకు మంచిది కాదు అనిపించేటంతగా వస్తుండేవి. ఆయన కీర్తిమంతుడు; కీర్తి న్యూసెన్సుగా కూడా అనిపించవచ్చు. నిజానికి ఈయన, కన్నడ సాహిత్యరంగంలో సుమారు రెండు దశాబ్దులకాలం ఏకైక సమ్రాట్టుగా వెలిగారు. కీర్తి ఆయన్ని వెదుక్కుంటూ వచ్చింది; గౌరవాలు ఆయనమీద వర్షించాయి. 1928 లో ఆయన, కన్నడ సాహిత్య పరిషత్తువారు నిర్వహించిన కన్నడ సాహిత్య మహాసభలకు అధ్యక్షులుగా ఎన్నికయారు. 1938 లో, మైసూరు మహారాజా వారు అయనకు రాజసేవాసక్త (రాజుగారి సేవకు అంకితమైనవాడు) అన్న బిరుదు ఇచ్చి సత్కరించారు. ఆ సంవత్సరమే ఆయన, పరిషత్తుకు ఉపాధ్యక్షులుగా ఎన్నిక అయారు. ఆ రోజుల్లో, దానికి రాజవంశంలో వారే ఒకరు అధ్యక్షులుగా ఉండేవారు; వస్తుతః నిర్వాహకాధికారి ఉపాధ్యక్షుడే.

ఉపన్యాసాలకు శ్రీకంఠయ్యగారే కావాలని ఎక్కువమంది కోరకోడానికి కారణం ఈయన ఉద్యోగ హోదాకాదు, పాండిత్యమూ కాదు. ఈయనకు గానానుకూలమైన చక్కని కంఠస్వరముంది. వయస్సులో ఈయన కంటె పెద్ద అయిన మిత్రులొకరు, ఈయనపేరులో ఉన్న పదాలు రెండింటినీ (శ్రీ—కంఠ) తీసుకొని శ్రీకంఠ కంఠశ్రీ (స్వరసంపద)ని ప్రశంసించారు. 'శ్రీ' అంటే సంపద, శోభ, ఒక దేవతపేరు. ప్రస్తుత సందర్భంలో ఈ మూడు అర్థాలూ సరిపోతాయి. వేదిక ఎక్కి ఉపన్యసించడమంటే ఈయనకు నల్లేరుమీద బండి సాగినట్టే. ఈయన వాక్యాలు రెక్కలు విప్పుకొంటాయి. ముందుకు దూకుతుంటాయి. మధ్యలో ఆగుతుంటాయి; ఈయన మనఃస్థితులకు అనుగుణంగా సాగుతుంటాయి. సరైన పదంకోసమో, పదబంధంకోసమో ప్రసంగం మధ్యలో ఆగవలసిన అవసరం ఈయనకు ఎన్నడూ కలగలేదు. ఈయనకు అవసరమయే సమయానికి ముందుగానే అవి చొచ్చుకువస్తాయి. ఒకేసారి ఒక డజను సమానార్థక శబ్దాలు ఈయన కోసం కాసుకొని ఉంటాయి; ఒక్కొక్కప్పుడు ఈయన వాటినన్నిటినీ వాడుతుండేవారు. దీనివల్ల అప్పుడప్పుడు ఉద్దిష్టమైన భావం దెబ్బతినే ప్రమాదముందని అనిపించవచ్చుకాని, వాతావరణంలో ఈయనకు ఏర్పడే అను

కూల్యం ఆ నష్టాన్ని అవసరానికి మించికూడా పూరించేది. ఈయన తర్కం, సంగతత్వం తాత్త్వికమైనవనడంకంటె కవితాత్మకమైనవని చెప్పాలి. ఒక్కొక్క సమయంలో ఈయన, విషయాంతరంమీద కలిగిన ఆకర్షణవల్ల ప్రధాన విషయాన్ని కొన్ని నిమిషాలపాటు విడిచిపెట్టడమూ ఉంది. కాని దీనివల్ల ఈయన ప్రసంగం ఇష్టాగోష్ఠి మాదిరిగా భాసిస్తుందేకాని శ్రోతల్ని ఎదురుగా పెట్టుకొని, ఉపన్యాసమిస్తున్నాను పట్టు-అన్నట్టు అనిపించదు.

ఉపన్యాసాలివ్వడానికి ఈయనకు ఎప్పుడూ అభ్యర్థనలు వస్తూండడంలో ఆశ్చర్యంలేదు. షేక్స్‌పియర్ మీదా, వర్డ్స్‌వర్త్ మీదా ఉపన్యసించడానికి ఆంగ్లభాషాభిమానులు ఈయన కావాలని కోరుకునేవారు; పంపకవి గురించో, రన్నకవి గురించో, కన్నడ సాహిత్య పునరుజ్జీవనం గురించో మాట్లాడటానికి కన్నడ భాషాభిమానులు కూడా ఈయన కావాలని కోరేవారు. తత్త్వశాస్త్రాన్ని గురించికాని మతాన్ని గురించికాని మాట్లాడటానికి ధార్మికులకు కూడా ఈయనే కావాలి. 'ప్రవక్తల భారం' అన్నది ఈయనకి ఇష్టమైన ప్రసంగ విషయం; కర్నాటక ఏకీకరణాన్ని గురించి మాట్లాడటానికి రాజకీయ విషయాభిమానులకు కూడా ఈయనే కావాలి. ప్రొఫెసర్ శ్రీకంఠయ్యగారు తమ సభలో ప్రసంగించాలన్న ఏకైక ప్రయోజనంకోసమే రూపొందిన సంఘాలు కూడా ఉన్నాయి ఆయన చుట్టూ వేలకొద్దీ జనం మూగేవారు. కొన్ని సందర్భాల్లో, కారు చెడిపోవడంవల్ల ఆయన సకాలానికి సభకి రాలేకపోతే, శ్రోతలు ఆయనకోసం గంటలతరబడి ఓపికగా కాసుకొని కూర్చునేవారు. ఒకసారి నేను విన్నాను; సాయంత్రం 6 గంటలకు మొదలుకావలసిన ఉపన్యాసం, నడిరాత్రి దాటిన తరవాత మొదలైందట.

జనంలో తనకు వచ్చిన పేరుకు శ్రీకంఠయ్యగారు సంతోషించేవారు. కాని ఈయన దేశమంతటా సంచారం చెయ్యటానికి కారణం, జనంలో ఉన్న పేరుకంటె, కన్నడ దేశంమీదా కన్నడ ప్రజలమీదా ఉన్న ప్రేమ అనే చెప్పాలి. రైలో, బస్సో, కారో – ప్రయాణానికి ఏది అందుబాటులో ఉంటే అది-చూసుకొని, రోడ్డు ఎంత బాగాలేకపోయినా సరే, ఏమాత్రం వీలున్నా ఉపన్యాసమిమ్మంటూ వచ్చిన ఆహ్వానాన్ని తిరస్కరించకుండా వెళ్ళేవారు. ప్రత్యేకించి, ఈయన దృష్టిలో మైసూరు రాష్ట్రానికి వెలుపల ఉన్న కన్నడ ప్రాంతంనుంచి వచ్చిన ఆహ్వానాన్ని అంగీకరించడం ఒక విధి జనాన్ని

కలుసుకోడమన్నా, దేశంలో సంచారం చెయ్యడమన్నా ఇష్టం ఈయనకి. ప్రతి స్థలానికి చరిత్రతో సంబంధాలున్నాయి. పదో శతాబ్దిలోని పంపమహా కవివల్ల వన్నెకెక్కినది 'బనవాసి'. హంపి ఒకప్పుడు విజయనగర సామ్రాజ్యానికి రాజధానిగా ఉండేది–హరిహరుడు, రాఘవాంకుడు అన్న కవులలో ఉన్న సంబంధాన్ని గురించి చెప్పేపనే లేదు; బాదామికి చాళుక్య చక్రవర్తులతో సంబంముధండేది; బేలూరులోను, హళేబీడులోను శిల్పసంపద విరాజిల్లుతున్నది. శ్రీకంఠయ్యగారి దృష్టిలో ఈ సంచారాలన్నీ యాత్రకిందా, ఇచ్చిన ఉపన్యాసాలన్నీ పూజకిందా లెక్క. కీర్తికి ఆకృష్టులై ఈయన దారి తప్పి పోతున్నారని ప్రొఫెసర్ శ్రీకంఠయ్యగారి శిష్యులందరిలాగే నేనూ అనుకున్నాను. అయితే మైసూరు రాష్ట్రప్రజలకూ, కర్నాటకంలో ఇతర ప్రాంతాల్లో ఉన్నవాళ్ళకూ (మైసూరునుంచి రాజకీయంగా వేరుపడి ఉన్న వాళ్లు) సంధానకర్తగా వ్యవహరిస్తూ, వాళ్ళలో సమైక్య సాధనాకాంక్షను రగుల్కొలుపుతూ ఈయన చేసిన కృషికి–ఒక రకంగా చూస్తే– ఈయన చేయగలిగిన ఏ అత్యుత్తమ సాహిత్య రచనకంటె నయినా అత్యధిక ప్రాముఖ్యముందని ఇప్పుడు స్పష్టమవుతోంది. కర్నాటకం మొత్తంమీద సమర్థ సమైక్య సాధకశక్తిగా వ్యవహరించిన ఏ వ్యక్తికన్న అయినా మిన్న అనిపించుకొన్నవారు శ్రీకంఠయ్యగారు. సాహిత్య, సాంస్కృతిక చరిత్రలో మాదిరిగానే కర్నాటక రాజకీయ చరిత్రలో కూడా ఈయనకు సమున్నత స్థానముంది.

1938–1942 మధ్య కాలంలో ఈయన కన్నడ సాహిత్య పరిషత్తుకు ప్రధాన నిర్వాహకులుగా పనిచేశారు. సెంట్రల్ కాలేజీలో ఉద్యోగ సంబంధమైన పనికంటె కూడా పరిషత్తులో గౌరవ హోదాలో చేసే పనిపట్ల ఎక్కువ ఆసక్తి చూపించేవారు. ఈయన 'కన్నడ నుడి' అన్న మాస పత్రిక స్థాపించారు. 'కన్నడద బావుటా' (కన్నడ జెండా) అన్న కన్నడ కవితా సంకలనానికి సంపాదకత్వం వహించారు. పరిషత్తుకు సొంత ప్రెస్సు ఒకటి ఉండవలసిన అవసరం చాలా కాలంగా కనిపించింది. అందుచేత దీనికి కావలసిన డబ్బు తామే విరాళంగా ఇచ్చి ఏర్పాటుచేశా రీయన. పర్యటన చేసి, ఉపన్యాసా లిచ్చి, చాలా మందిని పరిషత్తులో సభ్యులుగా చేర్చారు. సాహిత్యోత్సవాలూ, సమావేశాలూ నిర్వహించారు.

ఈయన తనకు ప్రియమైన పని చేస్తూనే ఉన్నా, అనేక గౌరవాలు అందుకొన్నా, పూజనీయు లనిపించుకొన్నా జీవితంలో చివర కొన్నేళ్ళు

సుఖంగా సాగలేదు. ఒక పరిమితమైన పరిధిలో ఈయన ఒక ప్రవక్త మాదిరిగా మన్నన లందుకొన్నారు. సాధారణంగా ఈ ప్రవక్తలు తమ జీవితంలో వివాదాస్పదు లవుతారు. ఈయన నాయకత్వంలో కన్నడం ఘోరమైన పతనానికి దారితీసిందని పాతరకం పండితుల నమ్మకం. కొత్త వాళ్ళకీ, పాతవాళ్ళకీ మధ్య ఈ వైరం చాలా కాలం ఉంది. క్రమంగా శ్రీ కంఠయ్యగారు, ప్రతిపక్షం వాళ్ళతో కలిసి బతకడం నేర్చుకున్నారు. కాని రెండు సందర్భాల్లో మాత్రం ఈయన నిజంగా ఎవర్నీ రెచ్చగొట్టాలన్న ఉద్దేశం లేకుండానే, స్పష్టంగా రెండు వివాదాల్లో ఇరుక్కున్నారు. వాటిలో ఒకటి, ఈయన వ్రాసిన 'అశ్వత్థామన్' అన్న నాటకంలో నాయకుడు ఆత్మ హత్య చేసుకోడానికి సంబంధించినది. దీన్ని గురించి తరవాత ముచ్చ టిస్తాను. రెండో వివాదం ఏమిటంటే – సృష్టిలో అన్నిటికంటె అదే ముఖ్య మన్నట్టు – 'కర్నాటక' అనే మాటలో వర్ణక్రమాన్ని గురించి వచ్చినది. ఈ కీచులాటల విషయంలో మనకేమీ ఆసక్తి లేదు. అశ్వత్థామన్ ఆత్మ హత్యకు అభ్యంతరం చెప్పిన అతిఛాందసవాదులూ, 'కర్నాటక' శబ్దం వర్ణక్రమానికి అభ్యంతరం చెప్పిన పరిశుద్ధతావాదులు భాషా ప్రపంచాని కేమీ నష్టం వాటిల్లకుండానే వాటిని ఉపేక్షించి ఉండవచ్చు. కాని ఆ రోజుల్లో మట్టుకు ఎంతో పారుష్యం ఉండేది. అప్పుడు రగిలిన మంట శ్రీ కంఠయ్యగారి మనస్సును గాయపరిచింది; ఆ మచ్చ ఎన్నటికీ మాయ లేదు. మళ్ళీ 1942లో పరిషత్తు వార్షిక సర్వసభ్య సమావేశం జరిగినప్పుడు పరిషత్తు పాలన వ్యవహారాలకు సంబంధించి అభిప్రాయభేదాలు వచ్చాయి. ఎన్నికల్లో మళ్ళీ పోటీ చేయడానికి శ్రీ కంఠయ్యగారు అనంగీకారం తెలి పారు. ఆ మాట పట్టుకుని ఎన్నికల్లో ఆయన పేరు ప్రతిపాదించడం మానే శారు. అప్పు డాయన కొత్తగా ఎన్నికయిన ఉపాధ్యక్షుడికి అధికారం అప్ప గించారు. ఈ సంఘటన అందరికీ బాధ కలిగించింది. విశ్వవిద్యాలయ ఉద్యోగంలోంచి కూడా ఆ ఏడే విరమించారు శ్రీ కంఠయ్యగారు.

అయితే శ్రీ కంఠయ్యగారికి ప్రభుత్వోద్యోగంలోంచి విరమించడ మంటే విశ్రాంతి తీసుకోవడమూ తీరుబాటుగా కూర్చోడమూ కాదు. అక్షరా స్యతావ్యాప్తికోసం ఏర్పరచిన కమిటీకి ఆయన అధ్యక్షులుగా నియమితు లయారు. 1944 వరకు ఆ పదవిలో ఉన్నారు. ఆ సంవత్సరమే, ధార్వా డాలో ఉన్న కె. ఇ. బోర్డ్ కాలేజ్ అఫ్ ఆర్ట్స్ వారు ఆయనకు ప్రిన్సిపాలు

పదవి ఇస్తామన్నారు. ఎంతోమంది స్నేహితుల సలహాను కాదని ఆయన ఆ ఉద్యోగానికి ఒప్పుకున్నారు. అక్కడేమీ ఆయనకి హాయిగా ఉన్నట్టు లేదు. అప్పటికే కొన్నేళ్ళుగా ఆరోగ్యం క్షీణిస్తూ వస్తోంది. మధుమేహంతోనూ, రక్తపుపోటుతోనూ చాలా బాధపడ్డారు. తన శరీరతత్త్వం భరించగలిగిన భారానికి మించి కూడా ఆయన చాలా ఏళ్ళపాటు కష్టపడి పని చేశారు. 1944 జనవరి 5న ధార్వాడలో కన్ను మూశారు. కర్నాటక దేశం యావత్తూ ఆయన మరణానికి సంతాపం ప్రకటించింది. ఆయన ఘనతకు జోహార్లు అర్పిస్తూ చేసిన ప్రకటనలు పత్రికల్లో వరసగా కొన్ని నెలలపాటు వచ్చాయి. కర్నాటక ఏకీకరణాన్ని కళ్ళారా చూడలేకపోయారాయన. కాని కర్నాటకం మాత్రం ఆయన్ని నవరాష్ట్ర నిర్మాతల్లో మహనీయుడుగా గణిస్తుంది.

# 2

# వ్యక్తి, పరిసరాలు, కాలం

1916 లో ఒకనాడు ఇద్దరు హైస్కూలు విద్యార్థులు ప్రొఫెసర్ బి. ఎం. శ్రీకంఠయ్యగారిని కలుసుకోడానికి వచ్చారు; పాఠశాల చర్చాసంఘం కార్యదర్శులు వాళ్ళిద్దరూ. వాళ్ళలో నేనొకణ్ణి. "ఆధునిక భారతదేశం కన్న ప్రాచీన భారతదేశమే ఉత్తమమైనది" అన్న విషయంమీద చర్చా కార్యక్రమం ఏర్పాటు చేసుకున్నాం; అలాటి చర్చావిషయం ఎన్నుకున్నందుకు మాలో మేము గర్వించాం. ఈ కార్యక్రమానికి సభాపతిగా, ప్రసిద్ధులైన ప్రొఫెసర్ శ్రీకంఠయ్యగారిని కనక తీసుకురాగలిగితే మా కార్యదర్శిత్వపు కుళ్ళాయి కది కలికితురాయే అవుతుందని భావించాం. మేము ఆయన గదిలో అడుగుపెట్టేసరికి, పుస్తకం చదువుతూన్నాయన తల ఎత్తి కొంచెం బింకంగా 'వెల్ ?' అన్నారు. మేము రావడం నిజానికి ఆయనకి ఇష్టంలేదేమో అన్నట్టు అనిపించి బిడియపడుతూ నోళ్ళుకట్టుకుని నిలబడ్డాం. మేము ఆయన కంటికి

మరీ పసివాళ్ళలా కనిపించామో ఏమో, తరవాత కొద్దిగా బింకం సడలించారు. 'ఆఁ, ఏంకావాలి మీకు?' అని అడిగారు. మేము చర్చావిషయం చెప్పేసరికి వంకరనవ్వు నవ్వి, 'హుఁ! ఆధునిక భారతదేశంకన్న ప్రాచీన భారతదేశం గొప్పది; భారతీయమైనవన్నీ తక్కినవాటికన్న గొప్పవి; భారత దేశంలోనే ఆధునికమైనవాటికన్న ప్రాచీనమైనవన్నీ గొప్పవి. కళ్ళకు కడుతున్న సంగతేకదూ?' కళ్ళకు కడుతున్న ఆ సంగతేమిటో మాకు తెలియదు.[1] కాని, మేము మట్టుకు ఢీలా పడిపోయాం. అలా వ్యాఖ్యానం చేసిన తరవాత మమ్మల్ని కూర్చోమన్నారనుకోండి; అయితే ఆ చర్చ జరగవలసిన రోజున తమకు వేరే కార్యక్రమం ఉందని చెప్పి మామీద సానుభూతి చూపించారు.

ఈ సంఘటన ఎందుకు చెబుతున్నానంటే, మేము వెల్లడించిన కోరికకు ఆయనదగ్గరినించి వచ్చిన సమాధానం ఈ శతాబ్ది రెండో దశకంలో శ్రీకంఠయ్యగారి మనఃస్థితికి మచ్చు అన్నమాట. ఆయన మూర్తిమత్వం గంభీరమైనది. ఎవరూ దగ్గరికి చేరడానికి అవకాశంలేకుండా ఉండేది. ఆయనకు ఓర్పు తక్కువ. మూఢత్వాన్ని, నేలబారుతనాన్ని, వెర్రి అభిమానాన్ని కూడా ఆయన అసహ్యించుకునేవారు. హృదయంలోకి ఏ భ్రమలూ చొరనిచ్చేవారు కాదు. ప్రాచీన భారతదేశం విషయంలోనైనా, అధునిక భారతదేశం విషయంలోనైనా, దేశభక్తి అనే పొరను కంటికి అడ్డు రానిచ్చేవారు కాదు. ఆయనలో మరో విలక్షణత ఏమిటంటే, ఆయన స్వభావం, అటు పారుష్యానికీ ఇటు దయార్ద్రతకూ నడుమ ఊగిసలాడుతూ ఉండేది; మొదట చిరచిరలాడినా తరవాత దానికి విచారం వ్యక్తంచేస్తూ ఉండేవారు. ఆయన నిరాశావాది అని, దేశభక్తి శూన్యుడని నిందలేకపోలేదు. కాని నిజం చెప్పాలంటే నేలబారుతనాన్నీ మాతృదేశాన్ని ఘనంచేసి గుడ్డిగా కీర్తించడాన్ని సహించకపోవడమే ఆయనలో ఉండేది.

ఈ మనోవృత్తిని అర్థం చేసుకోవాలంటే, ఈ శతాబ్ది తొలి సంవత్సరాల్లో భారతీయుల మానసికస్థితి ఎలా ఉండేదో గుర్తుకు తెచ్చుకోడం అవసరం. బ్రిటిష్‌వాళ్ళు మనల్ని పాలిస్తూ ఉండడమన్నది మన జాతీయ జీవనంలో ఒక విలక్షణమైన అంశం కావడం సహజం. భారత జాతీయ

---

1. మా సంభాషణ ఇంగ్లీషులో సాగింది. ఆ రోజుల్లో అదే మామూలు.

జీవనంలో, దానివల్ల గాఢంగా ప్రభావితం కానిదేదీ లేదు. దానివల్ల మేలు జరిగిందా, కీడు జరిగిందా అన్నది కాదు ప్రశ్న. మన జీవనంలో కనిపించే అనేక చిత్రమైన వైరుధ్యాలకి అది కారణం. 'ఆధునిక భారత దేశంకన్న ప్రాచీన భారతదేశమే ఉత్తమమైనది' అన్న విషయంమీద మేము చర్చ ఏర్పాటు చేసుకోడానికి, దాన్నిగురించి శ్రీకంఠయ్యగారు వ్యంగ్యంగా వ్యాఖ్యానించడానికి కూడా అదే కారణం. మనల్ని మనం గౌరవించుకోడం కోసమని, ఇప్పుడు మనల్ని పాలిస్తున్న వాళ్ళకంటె ఒకప్పుడు మనమే గొప్పవాళ్ళమన్న భావంతో, ప్రాచీన భారతదేశమే గొప్పదని మనం నమ్మవలసి వచ్చింది. 'బడా సాహిబ్'లు' మనతో ప్రవర్తించిన విధానం మనలో ఆత్మన్యూనతాభావం కలిగించింది. ఇది తరచుగా, ఒకే వ్యక్తిలో పరస్పర విరుద్ధాలైన వైఖరులు - మన సంస్కృతి సంప్రదాయాలపట్ల గౌరవాతిశయం ఒకపక్క, దాంతో సమానంగా కొంతవరకు అభిమానార్హులూ కొంతవరకు ద్వేషార్హులూ అయిన 'ఫరంగీ'ల సంస్కృతిపట్ల అభిమానాతిశయమూ - కలిగించింది. శ్రీ కంఠయ్యగారు, పై వాటిలో మొదట పేర్కొన్న వైఖరిని వ్యతిరేకించారు; ఆయనకు తెలిసిన ఇంగ్లీషువాళ్ళలో కొందరిపట్ల గౌరవం లేకపోవడంవల్ల రెండోరకం వైఖరి తగ్గింది. ఈయన, వాళ్ళలో కొందరితో తనను పోల్చిచూసుకొని, వాళ్ళ కార్యరంగంలోనే వాళ్ళను అధిగమించగలనని నిరూపించడం మనకు తెలుసు. పాశ్చాత్య సాహిత్యాన్నీ సంస్కృతినీ అధ్యయనం చేయడంవల్ల ఈయనకు సాధారణంగా, పాశ్చాత్య దేశాలపట్లా ప్రత్యేకంగా ఇంగ్లండుపట్లా గాఢమైన గౌరవం ఏర్పడింది.

ఇంగ్లండు మీద ఈయనకు గల అభిమానం వల్ల కొన్ని సందర్భాల్లో ఈయన ఎలా మోసపోయారంటే, భారతీయమైనవాటిమీద వేటిమీదా ఈయనకు గౌరవం లేదని ఈయన ప్రకటించిన అభిప్రాయాల్ని వ్యాఖ్యానించడానికి అవకాశం ఉండేది. ఇంగ్లండును, అక్కడి వ్యవస్థల్ని, సాహిత్యాన్ని, సంస్కృతిని ఈయన భారతదేశంకంటె కూడా ఎక్కువగా అభిమానిస్తారన్న అభిప్రాయం ఒకటి సామాన్యంగా ప్రచారంలో ఉంది కాని అది అన్యాయం. దీన్ని సవరించడానికి ఈయన ప్రయత్నించి ఉంటే బాగుండు ననిపిస్తుంది నిజానికి భారతదేశం గర్వించదగినది గతంలో - అంటే, అద్యతనంగా కాకుండా ప్రాచీన కాలంలో - ఉండేదని శ్రీ కంఠయ్యగారికి తెలుసు. ఈ విషయం ఈయన పనిగట్టుకొని చెప్పేవారు. ఇంతకు

ముందు మనం చెప్పుకొన్నట్లు, ఈ శతాబ్ది ఆరంభ కాలంలో చాలామందికి, భారతదేశ గౌరవ మన్నది కచ్చితంగా తాము విశ్వసించే విషయంగా కాకుండా, ఏదో నమ్మాలి కాబట్టి నమ్మవలసివస్తున్న విషయంగా ఉండేది. సంస్కృత సాహిత్యాన్నీ, భారతీయ దర్శనశాస్త్రాన్నీ సాంప్రదాయికంగా అధ్యయనం చేసిన కొద్దిమంది కూడా విమర్శాదృష్టితో చూసేవాళ్ళు కాదు. వివిధ సంస్కృతుల్ని తులనాత్మకంగా అధ్యయనం చేసి లాభం పొందిన వాళ్లు కాదు. పాతరకానికి చెందిన సగటు పండితుడికి సాహిత్యరంగం లోనూ, దర్శనశాస్త్ర రంగంలోనూ తప్ప తక్కిన వాటిలో భారతదేశం సాధించినవాటిని గురించి తెలిసింది తక్కువ. పడుచుతనంతో పరవళ్ళు తొక్కుతూ, హుమ్మస్సుతో జబర్దస్తీగా సాగుతూ, అన్నిటి కంటె ముఖ్యంగా జైత్రయాత్ర సాగిస్తున్న పాశ్చాత్య సంస్కృతి పట్ల వాళ్ళు అవిశ్వాసం, భయం ప్రకటించేవారు.

శ్రీ కంఠయ్యగారు కళాశాలలో ప్రవేశించే నాటికే ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల పద్ధతుల్లో నడిచే విశ్వవిద్యాలయాల్లో తరిఫీదు పొందిన కొత్తరకం పండితులు పెరిగారు. పైన చెప్పిన ఆత్మన్యూనతాభావం వాళ్ళలో ప్రవేశించలేదు. కాని వాళ్ళ వైమనస్యం ఆధిక్యప్రకటన రూపంగా కాక, భారతదేశపు గత చరిత్రను పరీక్షించడం ద్వారా వ్యక్త మయింది. తమ ఆత్మగౌరవానికొక స్థిరమైన ప్రాతిపదికను కనుక్కో డానికి, నిశితంగానేగాక, ఒక్కొక్కప్పుడు నిర్దాక్షిణ్యంగా కూడా పరీక్షించడం జరిగింది. భారతదేశంపట్ల వాళ్ళకు గల ప్రేమను ప్రశ్నించడానికి వీలు లేదు. కాని భారత దేశానికి అప్రతిష్ఠాకరమైన అంశమేమైనా కనిపిస్తే, వాళ్ళు దాన్ని ఒప్పుకోనేవారు; నిస్సంకోచంగా ఎదుర్కొనేవారు; సంస్క రించవలసిన అవసరముందని వాదించేవారు. గ్రంథస్థమైన ఉత్తమ విమర్శను అధ్యయనం చేసి అనువర్తింపజేయడంవల్ల, చారిత్రక స్పృహతో పునర్ జాగృతమైన విమర్శాదృష్టి వాళ్ళకు తోడ్పడింది. గతాన్ని ఉపేక్షించ కుండానే, గుడ్డి ఆరాధనను పరిహరించేవారు; కొత్త సంస్కృతికి, కట్టు బానిస కాకుండానే స్వాగతం పలికారు.

శ్రీ కంఠయ్యగారు ఈ కూటమిలోవారు. గతంమీదకన్న భవిష్యత్తు మీద ఈయనకు ఆసక్తి ఎక్కువ ఉండేది అయితే ఒక భవిష్యత్తును నిర్మించు కోడానికి అవగాహన, వ్యాఖ్యానం, గతాన్ని గురించిన అంచనా తప్పనిసరి

అయిన ప్రాథమిక విషయాలని ఆయనకు తెలుసు. అంచేత, సంస్కృతంలో ఆస్థ కలిగించుకున్నారు. కాని ప్రాముఖ్యమిచ్చింది మాత్రం, కన్నడానికీ దాని సోదరభాష అయిన తమిళానికీను. సంస్కృతంలోంచి ఎక్కువ పద జాలం తీసుకోకుండా ఈయన ప్రసంగించిన సందర్భాలు ఉన్నాయన్న విషయం అంగీకరించక తప్పదు. అయితే ఒక్క సంగతి మనం మరిచిపో గూడదు – కన్నడం ఎంతకయినా ఓర్చుకోగలదన్నట్టుగా సంస్కృత భాషా వాదులు ఈయన్ని రెచ్చగొడుతూ ఉంటారు. శ్రీకంఠయ్యగారు సంస్కృ తాన్ని ప్రేమించింది తక్కువేమీ కాదు; కాని కన్నడాన్ని అంతకంటె ఎక్కువ ప్రేమించేవారు.

ఇందులో మొదటి అధ్యాయంలో[1] ప్రస్తావించిన ధార్వాడ ప్రసం గంలో ఈయన తమ స్థితిని నిర్మమత్వంతో ప్రకటించారు; ఇరవైవిడేళ్ళ పడుచుప్రాయంలో ఇటువంటిది ఆశ్చర్యకరమే.

"కన్నడం తల ఎత్తుకోడం ఎలా?" అన్న శీర్షికే గుర్తించదగ్గది. కన్నడం తల ఎత్తుకోవలసిన అవసరం ఎంతో ఉంది. దేశపటంలో ఉన్నందుకే కించపడుతున్నట్టుగా, స్వదేశంలోనే దాని స్థానాన్ని అధః స్థాయికి దిగజార్చడం జరిగింది. ఒక పక్క సంస్కృతం, మరోపక్క ఇంగ్లీషు నిలబడి దీన్ని న్యూనపరిచాయి సంస్కృతం దేవభాష, మన పవిత్ర గ్రంథాల భాష, మన ప్రాచీన సంస్కృతికి నిధానం. ఛాందసుల దృష్టిలో, మనం అధ్యయనం చెయ్యదగ్గ భాష సంస్కృతం ఒక్కటే. ఇంగ్లీషు అధికార భాష, మన పాలకుల భాష. పాఠశాలల్లోనూ కళాశాలల్లోనూ బోధన జరిగేది ఆ భాషలోనే. ఆ భాషలో ప్రావీణ్యం సంపాదించడమే విశేష ప్రతిభకు నిదర్శనమవుతుంది. ప్రభుత్వోద్యోగాల్లో అన్నిటికంటె కింది స్థాయిలో తప్ప, తక్కిన స్థాయిల్లో దేంట్లో ఉద్యోగం రావాలన్నా ఆ భాషలో మంచి పరిజ్ఞానం ఉండడం అవసరం. విద్యావంతుల్లో కన్నడమే మాతృభాష ఆయినవాళ్ళు తమలో తాము మాట్లాడుకోడం కూడా ఇంగ్లీషులో నైనా చేసేవారు; లేకపోతే, కన్నడమూ ఇంగ్లీషూ కలగాపులగం చేసిన మరో భాషలోనైనా మాట్లాడేవారు. ఇదంతా సహజమైన పరిస్థితే అన్నట్టు అంతా అంగీకరించారు. కన్నడ పునరుజ్జీవనోద్యమానికి శ్రీకంఠయ్యగారు నాయకులుగా వెల్లడి అయిన తరవాత, మైసూరులో ఉన్న మహారాజ కళా

---

1. చూడండి: ఒక పుటలోఉన్న అధోజ్ఞాపిక

శాల అధ్యాపకుల్లో ఒకరు నన్నిలా అడిగారు: "కన్నడాన్ని గురించి మీ శ్రీకంఠయ్యగారు చేస్తున్న గొడవంతా ఏమిటి? విషయమేమన్నా ఉందా?" ఆయన నిజంగానే గందరగోళంలో పడి అలా అడిగారు. ఎవరి జీవితంలోనయినా కన్నడానికి సార్థకత ఎందుకుండాలో ఆయన అర్థం చేసుకోలేదంతే.

శ్రీకంఠయ్యగారు "కన్నడ జెండా" ఎగరేసింది అటువంటి కాలంలో అన్నమాట.[1] "కర్నాటకరాష్ట్ర నివేదిక" అన్నదొకటి తయారు చెయ్యమని ఆయన్ని అడిగి ఉంటే, బహుశా అది ఈ విధంగా ఉండేదనుకుంటాను[2]: "కన్నడం మన మాతృభాష' అని చెప్పేవాళ్ళు మనలో చాలా మంది ఉన్నారు. అది నిజమే. కాని దాన్ని గురించి మనం వెర్రి అభిమానం పెంచుకోవద్దు. మన తల్లులు నేర్పిందేదో అది చాలు మనకి. మన మానసిక, ఆధ్యాత్మిక పరిపుష్టికి కావలసినదంతా సంస్కృతం, ఇంగ్లీషు ఇవ్వగలవు. ఇంతకాలం, కన్నడం సంస్కృతం మీద ఎంతగా ఆధారపడి ఉందో మీకు తెలుసు. ఈనాడు సంస్కృతం కూడా సరిపోదనిపిస్తోంది. పాశ్చాత్య సంస్కృతిలోని ఉత్తమమైన వాటికన్నిటికీ ఇంగ్లీషే ముఖద్వారం. చూడండి, ఆధునిక జీవితంలో వందపనులు నెరవేరాలంటే కన్నడ సంస్కృతాలకంటె కూడా చాలా ఎక్కువగా ఉపయోగపడేది ఇంగ్లీషు; పత్రికా రచనాత్మకమైన సాహిత్యం, సాంఘిక భౌతికశాస్త్ర వివరణలు, తాత్త్వికరచనలు, సున్నితమైన హాస్యం, గాఢమైన భావోద్రేకం – ఇంగ్లీషులో నిజంగా ఎంత సంపద, ఎంత వైవిధ్యం ఉన్నాయి! నవల, వ్యాసం, వ్యంగ్యరచన, కథానిక, గీతిక, స్థూలంగా నాటకం, ప్రత్యేకించి విషాదాంత నాటకం అన్న సాహిత్య ప్రక్రియలతో అది సుసంపన్నమై ఉంది. అన్ని శాఖల్లోనూ ఇంత సంపన్నమైన ఆంగ్లసాహిత్యానికి కన్నడం దీటుగా నిలబడగలదా? అనుభవపూర్వకంగా చూద్దాం. ఒక శతాబ్దికి పూర్వంనుంచే ఇంగ్లీషు మనతో ఉంది. దాన్ని అవలంబిద్దాం. భారతదేశంలో ఇతర ప్రాంతాలతోటి,

1. 'కన్నడద బావుటా' (కన్నడ జెండా) అనేది ఆయన కావ్యఖండికల్లో ఒకదాని పేరు; ఆయన సంకలనం చేసిన కవితా సంపుటికికూడా అదే పేరు.

2 ఇక్కడిచ్చిన సారాంశం ప్రధానంగా, వెనక ప్రస్తావించిన ధార్వాడ ప్రసంగాన్ని ఆధారం చేసుకొని వ్రాసిందే.

మిగిలిన ప్రపంచంతోటి సంబంధాలు పెట్టుకోడానికి మనకది అనుసంధాన భాషగా ఉపకరిస్తుంది.''

ఇదంతా చాలావరకు సత్యమని శ్రీకంఠయ్యగారు అంగీకరించారు. అంతేకాదు; "కన్నడం ఇవ్వగలిగింది ఏమిటి?" అని కూడా ప్రశ్నించారు. ఈయన చాలా సమంజసంగా మాట్లాడతారు. నిజం చెప్పాలంటే, కన్నడాన్ని వెనకేసుకువచ్చే ఈయన, దానికి వ్యతిరేకులమని బల్లగుద్ది చెప్పేవాళ్ళకంటె కూడా ఒక్కొక్కప్పుడు నిర్దాక్షిణ్యంగా వ్యవహరించడంలేదు కదా అని ఎవరికయినా అనిపిస్తూ ఉంటుంది! తరవాతికాలంలో ఈయన ఒక్కొక్కప్పుడు కన్నడ కవిత్వాన్ని అతిగాకూడా పొగిడారన్నది నిజమే. కాని ఆ రోజుల్లో పడవలసిన మందు వేరేది అన్న విషయం మనం గుర్తుంచుకోవాలి. మనలోఉన్న నేలబారుతనాన్నీ, ఉదాసీనతనూ వదిలించడానికి ఆ మాదిరి చురక పడాల్సిందే; అంతేకాదు, మనలో విశ్వాసం నెలకొనడానికి పొగడ్త కూడా అవసరమే. కన్నడాన్ని గురించి ఆయన చెప్పేదానికి సారాంశం ఇది.

"పురాణాలకూ మతపరమైన (మతం మనకి ఎక్కువయిపోయింది; దాన్ని ఇక పోనివ్వండి) కవిత్వానికి సంబంధించిన మహాయుగం చాలా కాలం కిందటే అంతరించింది. అప్పటికే వెక్కసం కలిగించేటంతగా మనం సంస్కృతం నుంచి ఎరువు తెచ్చుకోలేదూ? పంప, నారాణప్ప[1] వ్యాసుడి లాగే సాగినట్టు పైకి కనిపిస్తోంది కదా అని మీరు అనవచ్చు; కాని ఎవరి దారిని వాళ్ళు సాగారు. నిజమే, అయినా పాత కావ్యవస్తువులే అంతులేకుండా తీసుకుంటూ వ్రాస్తే భరించలేం – ముఖ్యంగా, ఒక గొప్ప పూర్వకథను నూతనజీవన దృక్పథంతో పునఃసృష్టిచేయడానికి కావలసిన ఊహ లేని కవుల విషయంలో ఇది మరీ ఎక్కువ. యతిప్రాసలు, ద్వంద్వార్థాలు, కుకవినింద, స్వోత్కర్ష, అష్టాదశవర్ణనలు (కృతకమైనవని కొట్టొచ్చినట్టు కనిపిస్తూనే!) – ఇవన్నీ మనకు సమృద్ధిగా ఉన్నాయి. వెన్నెట్లో విహారమో, జలక్రీడలో తారసపడ్డాయంటే-రెండు ఆశ్వాసాలు పట్టేశాయన్నమాటే! వాటిలో ఉండే శోభ, సొగసు మనకు అనుభవమవుతాయేమోనని వృథాగా అన్వేషిస్తాం! అటువంటి కవిత్వం నిజంగా పండితులకోసం పండితులు వ్రాసిందేకాని

1. ఇద్దరు కన్నడ మహాకవులు. మహాభారత కథను ఎవరి ఫక్కీలో వారు చెప్పారు.

సామాన్యజనంకోసం వ్రాసింది కాదు. వాళ్లు వ్రాసింది కన్నడంలోనేనని చెప్పడం కూడా ఒక్కొక్కప్పుడు కష్టమవుతుంది. నాలుగు పాదాలున్న ఒక పద్యంలో (శ్రీకంఠయ్యగారు దాన్ని ఉదాహరిస్తారు) ఒకే ఒక కన్నడపదం ఉంది. తక్కినదంతా సంస్కృతం; అందులోనూ ఇనపగుగ్గిళ్ళులాంటిది.''

కనక, ప్రాచీనకాలానికీ మధ్యకాలానికీ సంబంధించిన అటువంటి సాహిత్యాన్ని సగర్వంగా చూపించి, 'అది చాలదా ?' అని ఎవరైనా ప్రశ్నించినట్లయితే, 'ఉఁహూ, చాలదు. అబద్ధపు దేశభక్తివల్ల గుడ్డివాళ్ళమయితే తప్ప అది చాలని అనుకోడానికి వీలులేదు. సాధారణమైనది ఎన్నటికీ గొప్పది కాదు, కల్తీసరుకు స్వచ్ఛమైనదీ కాదు. దోరకాయ పండు కానేకాదు.'

అయితే ఇదంతా చెప్పడం, కన్నడాన్ని ఉపేక్షించడానికి చేసిన వాదం కాదుసుమా, అని శ్రోతలను హెచ్చరించారాయన. సోదాతనం, ఆత్మ సంతృప్తి వదుల్చుకోడానికి చేసిన హెచ్చరిక ఇది. అసంతృప్తిలోంచే అభ్యుదయం మొలకెత్తుతుందని చెప్పడం ఆయన సరదా. కన్నడంలో ఉన్న లోపమేమిటో గ్రహించి దాన్ని సరిచెయ్యడానికి ప్రయత్నించాలి. అప్పుడప్పుడు శ్రీకంఠయ్యగారు తమ వాదానికి తామే ఎదురుతిరిగి కటుత్వం తొలగించేవారు; అంటే, పంపకావ్యంలోంచికాని రన్నకావ్యంలోంచికాని గొప్ప కవిత్వానికి మచ్చుతునకలు కొన్ని వినిపించి, ఆ స్థాయిని మళ్ళీ అందుకోడానికి ప్రయత్నించవలసిందిగా శ్రోతల్ని కోరుతుండేవారు. ఆయన ధార్వాడ ప్రసంగం, చేయవలసిన కృషికి ఏర్పరచిన ఒక ప్రణాళికతో ముగుస్తుంది.

ఈనాడు, ఢిల్లీలో ఉండి (ఆ ప్రసంగం చేసిన అరవైఏళ్ళ తరవాత) వెనక్కి చూసినట్లయితే ఆనాడు ఆయన చెప్పినది సులువైన విషయంగానే అనిపించవచ్చు. కాని ఆ రోజుల్లో మాత్రం ఆయన ప్రణాళికలోని కొన్ని అంశాలు తీవ్రమైన వివాదానికి దారితీశాయి. ''మన ప్రాచీన అముద్రిత గ్రంథాల్ని చెదలు తినెయ్యకముందే సేకరించి, పరిష్కరించి ప్రచురిద్దాం'' అన్నారాయన. అంతవరకు బాగానే ఉంది. అయితే, ప్రాచీన సాహిత్యాన్ని సుస్పష్టమైన దృష్టితో అంచనా వెయ్యాలి (ఎందుచేతనంటే, కడపటి విశ్లేషణలో మిగిలేది సత్యమేకాని భ్రాంతి కాదు'') అని చెప్పినప్పుడు మాత్రం గొడవ వచ్చింది. భాషాచరిత్ర, సాహిత్య చరిత్ర వ్రాయాలన్నారు. అది హర్షించేదే. కాని ఆ మాట చెబుతూ, వాటిని వ్రాసేవారికీ బోధించేవారికీ

ఆంగ్ల భాషాజ్ఞానం, ఆధునిక విమర్శాపద్ధతుల పరిజ్ఞానం ఉండితీరాలని చెప్పడంలో సంప్రదాయవాదులతో పేచీ పడవలసివచ్చింది. ఆ రోజులు ఎల్లాటి వంటే, కన్నడం నేర్పడానికి సంస్కృతం వచ్చి ఉంటే చాలని పాతతరం పండితులు అనుకోడమేకాదు, గట్టిగా నమ్మేరోజులు. సంస్కృతంతోబాటు కొంచెం కన్నడం కూడా నేర్చుకుంటే చాలని చెబితే ఒప్పుకునేవారేమో. కాని కన్నడం నేర్పడానికి ఇంగ్లీషు ఎందుకు? సాహిత్యభాష సామాన్యుడి వాడుక భాషకు బాగా సన్నిహితంగా ఉండాలని (రెండూ ఒకటే కావాలనికాదు) శ్రీకంఠయ్యగారు చెప్పినప్పుడు, రెండో అక్షరంలో ప్రాస (ఆదిప్రాస) అక్కరలేదనప్పుడు, ఛందస్సుల సంకెళ్ళలోనుంచి బయటపడి ఇంకా స్వేచ్ఛ పొందాలని ఆయన వాదించినప్పుడు, సామాన్య మానవుడి నిత్యజీవితంలో నుంచే కావ్యవస్తువులు తీసుకోవాలని చెప్పినప్పుడు, సంప్రదాయవాదుల దృష్టిలో ఆయనది మహాపచారమైంది. అప్పుడప్పుడు శ్రీకంఠయ్యగారు అవతలివాళ్ళను రెచ్చగొడుతూ కూడా మాట్లాడేవారన్నది నిజం. ఇది ఇలా ఉండగా, తమ వాదం వీగిపోయేస్థితి వచ్చిందని సంప్రదాయవాదులు భావించే వారు. దాంతో నిగ్రహం కోల్పోయి పరుషంగా మాట్లాడేవారు. నాకింకా జ్ఞాపకం, ఒకసారి ఒక పెద్దమనిషి (యూనివర్సిటీ చదువు చదివినవాడే), కన్నడ కవిత్వాన్ని గురించి శ్రీకంఠయ్యగారి శిష్యుడొకడు ఇచ్చిన ఉప న్యాసం విని చీదరించుకొంటూ "చీపురుకట్టల మీదా అట్లపెనాల మీదా కవిత్వమా! పాశ్చాత్య నాగరికతవల్ల పుట్టిన తప్పుడు ముండాకొడుకులు వీళ్ళు!" అన్నాడు.

సంప్రదాయవాదులకు ఎలాంటి అవకాశమూ చిక్కలేదు. యువకు లందరూ శ్రీకంఠయ్యగారి వెనక ఉన్నారు. పైగా, ఈయన మద్దతుతో సాగే కర్నాటక ఏకీకరణ ఉద్యమం విషయంలో భిన్నాభిప్రాయమన్నదే లేనందువల్ల ఈయనకు మంచి పేరుప్రతిష్ఠలున్నాయి. ఇది రాజకీయపు ఎత్తు మాత్రం కాదు. కన్నడ భాషాసాహిత్యాల వికాసం కొంతవరకు ఆ ఏకీకరణ మీద ఆధారపడి ఉంది. రాజకీయమైన కారణాలమూలంగా కన్నడ దేశం ముక్కలై ఆరు రకాల దొరతనాల ఏల్బడిలోకి పోయింది. ఒక పెద్ద భాగం మైసూరు మహారాజు పాలనలో ఉంది. కొన్ని జిల్లాల్ని నేరుగా బ్రిటిష్‌వాళ్ళే పాలిస్తున్నారు; కొన్ని జిల్లాలు హైదరాబాదు నిజాం పాలనలోనూ ఇతర రాజుల పాలనలోనూ ఉన్నాయి. నిజాం తన రాజ్యంలో ఉర్దూను పాలన

భాష చేశాడు. ఉత్తర కర్నాటక జిల్లాల్లో వాడుకలో ఉన్న కన్నడంమీద మరాఠీ ప్రభావం ఎంత గాఢంగా ఉందంటే, మైసూరునుంచి ఎవరైనా అక్కడికి వెళ్తే అక్కడి భాష అర్థం చేసుకోడం కష్టమయేది. కొన్ని తాలూకాల్లో కన్నడం బళ్ళే లేవు. మైసూరు రాష్ట్రంలో సైతం, విద్యావ్యవస్థ 1915 వరకు మద్రాసు విశ్వవిద్యాలయంవాళ్ళ నియమ నిబంధనల ననుసరించే నడుచుకొనేది. మైసూరు విశ్వవిద్యాలయం స్థాపించిన తరవాత కన్నడ భాషకొక ఆచార్యపీఠం నెలకొల్పడానికి పదిహేనేళ్లు పట్టింది. అటువంటి పరిస్థితుల్లో కర్నాటకమంతటా, కన్నడాన్ని అధికార భాషగానూ విద్యాబోధన భాషగానూ ఏర్పరచడానికి సమైక్య కృషి కావించడం సాధ్యమేనా? ఇందుకు చొరవ తీసుకునేవారెవరు?

కన్నడ పునరుద్ధరణకు ఉద్యమం ప్రారంభించిన సంస్థలు రెండు– ధార్వాడలో ఉన్న 'కర్నాటక విద్యావర్ధక సంఘ', బెంగూరులో ఉన్న 'కన్నడ సాహిత్య పరిషత్తు'. జాతీయ స్థాయిలో సాగుతున్న స్వాతంత్ర్య సంగ్రామం, ప్రాంతీయాభిమానానికీ భాషాభిమానానికీ కూడ దోహదం చేసింది. దీనివల్ల నష్టాలు కొన్ని ఉన్నప్పటికీ కన్నడ ఉద్యమానికి మాత్రం తోడ్పడింది. సామాన్య మానవుడికి చేరువ కావలసిన రాజకీయవేత్తలు, కన్నడంలో మాట్లాడడం, వ్రాయడం అవసరమని తెలుసుకున్నారు. రాజకీయ ప్రచారం చేస్తూనే సందర్భవశాత్తు మాతృభాషాభిమానం కూడా పెంపొందించారు. కర్నాటకంలోని అన్ని ప్రాంతాలవాళ్ళ గౌరవాన్నీ అందుకొంటూ, రాజకీయ సాంస్కృతిక శక్తులనన్నిటినీ సంఘటితపరిచి సామరస్యంగా పని చేయించగల నాయకుడొకడు రంగంలోకి ప్రవేశించవలసిన సమయం ఆసన్నమైంది. అటువంటి నాయకుడు శ్రీకంఠయ్యగారేనని కర్నాటకం గ్రహించింది.

ఆయన ఎదుర్కోవలసిన రంగాలు ఎన్నో ఉన్నాయి. సంస్కృత భాషావాదులు ఒకపక్క, ఆంగ్ల భాషావాదులు మరొక్క పక్క, కన్నడ భాషావాదుల్లోనే సంప్రదాయవాదులు ఇంకొకపక్క ఉన్నారు. ఇవికాక, రాజకీయ రంగం కూడా ఒకటి ఉంది – ఈయన రాజకీయవాది కారుకాని, కర్నాటక రాజకీయాల్ని పట్టించుకోకుండా ఉండనూ లేదు. ఇది చాలా చిత్రమైన సంక్లిష్టస్థితి; ముఖ్యంగా, రెండు వర్గాల వాళ్ళతోనూ ఆయన చేతులు కలిపినప్పుడు! ఈ పరిస్థితి గ్రహించినట్లయితే, ఆయనలోని సంకీర్ణ

మూర్తిమత్వాన్ని అవగాహన చేసుకోడానికీ, ఎదుర్కోవలసిన సమస్యలపట్ల ఆయన చూపే వైఖరిలో పైకి కనిపించే వైరుధ్యాల్ని విడమరచడానికీ వీలవు తుంది. ఆయన సంస్కృతాన్ని అభిమానించేవారు; కాని అది కన్నడాన్ని చిన్నబుచ్చడానికి ఒప్పుకునేవారు కాదు. సంప్రదాయానికి విలువ ఇచ్చేవా రాయన; కాని దాని మీదికే తిరుగుబాటు లేవదియ్యవలసివచ్చింది. ఇంగ్లీషును అభిమానించేవారు; కాని కన్నడానికే ప్రథమ స్థానమియ్యాలనేవారు. ఈ సమస్యలవల్ల ఆయన వైఖరి ఎలా ఉండేదో ముందు చెప్పాను. అయితే ఆయనకు ఇంగ్లీషు మీదా, ఇంగ్లండు మీదా ఉన్న ప్రేమను గురించి మరి నాలుగు మాటలు చెప్పడం అవసరమనుకుంటాను. ఇంగ్లీషు సాహిత్యంమీద ఆయనకున్న ప్రేమను గురించి ప్రత్యేకంగా సమర్థించి చెప్పవలసిన అవసరం లేదు. భారతదేశంకంటె కూడా ఇంగ్లండునే ఎక్కువ ప్రేమించేవారా? ఇంగ్లండుతో కలిగిన సంపర్కంవల్ల భారతదేశానికి చాలా మేలు కలిగిందని విశ్వసించారాయన. రాజారామమోహన్‌రాయ్ కాలంనుంచి ఈనాటి వరకు అనేకమంది గొప్ప దేశభక్తులకు ఇదే విశ్వాసం ఉంది. భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామం గురించి శ్రీకంఠయ్యగారు ఎక్కువగా పట్టించుకోలేదన్నది కూడా నిజమే – ఆయన ప్రభుత్వోద్యోగంలో ఉండేవారు; అంచేత బ్రిటిష్ వాళ్ళకు వ్యతిరేకంగా సాగిన ఏ కార్యకలాపాల్లోనూ ఆయన పాల్గోలేదు. ఆయన కనక రాజకీయాల్లోకి ప్రవేశించి ఉన్నట్లయితే, బహుశా 'మోడరేట్లు' (మిత వాదులు) అనే వర్గంలో ఉండేవారేమో. కాని ఆయన కావాలనే, ఎంతో వినయంగా, తమ కార్యకలాపాల్ని కర్నాటకానికే పరిమితం చేసుకున్నారు. "ఢిల్లీ దూరం; పల్లే చాలు నాకు" అని చెప్పారు. దేశంలో వాతావరణమంతా ఇంగ్లండుకు వ్యతిరేకంగా ఉన్న సమయంలో ఆయన, ఆ దేశం మీద తన కున్న ప్రేమను గురించి ముఖతః చెప్పవలసిన అవసరం లేదని ఒప్పుకో వచ్చుననుకుంటాను. ఒక కథ ప్రచారంలో ఉంది; "నేను చచ్చిపోయినప్పుడు నా గుండె మీద 'ఇంగ్లండు' అని రాసి ఉంటుంది చూడండి (ఈ మాట అన్నవాడు షేక్స్‌పియర్ అని కొందరంటారు)" అని ఆయన అన్నారట. ఈ కథ నిజమో కాదో నాకు తెలియదు. షేక్స్‌పియర్, వర్డ్స్‌వర్త్ లంటే ఆయనకు అభిమానం; అంచేతనే వాళ్ళ దేశంమీద ఆయనకు అభిమానమని తోస్తుంది. ఇంగ్లండు మీద ఆయనకున్న అభిమానం, భారతదేశం మీదా కర్నాటకం మీదా ఆయనకున్న అభిమానాన్ని పోగొట్టేదికాని, మరుగుపరిచేది

కాని కాదు. ఆయన గుండె మీద ఏదైనా వ్రాసి ఉండడమే జరిగితే అది 'కన్నడ' మే అనుకుంటాను.

ఆయన రాజకీయాల్ని పట్టించుకునేవారు కాదని ఇంతకు ముందు చెప్పాను – కర్నాటక ఏకీకరణ విషయంలో ఆయనకు గాఢమైన ఆసక్తి ఉండేది. కాని అంతకంటె పెద్దసమస్య – భారత స్వాతంత్ర్య సమస్య. బ్రిటిష్‌వాళ్ళు తమ ఏలుబడిలోని పెద్ద భూభాగాల్ని పళ్ళెంలోపెట్టి మైసూరు రాష్ట్రానికి ఇవ్వరు. ఒకవేళ వాళ్ళు ఇచ్చినా, నిజాంరాజులాంటివాళ్ళ పాలనలో ఉన్న కన్నడ ప్రాంతాల సమస్య అలాగే ఉండిపోతుంది. మహాత్మా గాంధీ, భారత జాతీయ కాంగ్రెస్‌వారూ పెద్ద సమస్య పరిష్కారం విషయం చూస్తున్నారు. కాని శ్రీ కంఠయ్యగారు, పనులు జరిగేవరకు మనం కాసుకుని కూర్చోలేమని భావించారు. సమైక్య కర్నాటకం కావాలని మనం పట్టుపట్టేవరకు అది రాదు. ప్రజల్ని రెచ్చగొట్టాలి. మామూలుగా ఈ పని, రాజకీయవాదులు చెయ్యవలసింది. కాని ఆ రోజుల్లో, వాళ్ళకంటె శ్రీకంఠయ్యగారికొక సౌకర్యముంది. సమైక్య కర్నాటకం కావాలన్నది చాలా సమంజసమైన కోరికేనని ఆయన కూడా అన్నారు. అయితే మొత్తంమీద, అధికారంలో ఉన్నవాళ్లు మాత్రం ఈయన్ని, రాజకీయ ప్రయోజనాలేమీలేని నిరపాయకరమైన పండితుడిగా భావించారు. అంచేత అధికారులు ఈయన్ని అనుమానించలేదు. ఈయన ఎగరేసిన జెండా కన్నడ భాషా సాహిత్యాలది. ఈయన విజ్ఞాపన చేసింది, కర్నాటక సాంస్కృతిక సమైక్యానికి ప్రతీకగా నిలిచిన పరిషత్తుతో సహకరించవలసిందని. అయితే ఈయన ఉపన్యాసాల్లో తరచు, రాజకీయ సమైక్యంవైపు కొద్దిగా మొగ్గ కనిపించేది. నిజానికి, సూటిగా బ్రిటిష్‌వాళ్ళ పాలనలో ఉన్న ప్రాంతాల ప్రజలు, మైసూరు రాష్ట్ర ప్రజలకంటె, ఏకీకరణాన్ని గాఢంగా అభిలషించేవారు; తెగేసి చెప్పేవారు. అయితే ఒక్క చిక్కుంది. మహారాజు పాలనలోకి వెళ్ళడం వాళ్ళకి ఇష్టం లేదు. స్వాతంత్ర్యమంటే వాళ్ళదృష్టిలో, రిపబ్లిక్ అనే లెక్క. ఈ విషయంలో శ్రీ కంఠయ్యగారు వాళ్ళకి చిరాకు కలిగించి ఉండవచ్చు. పాతకాలపు భూస్వామ్యతత్త్వంజాడ ఈయనలో కొసవెర్రిగా ఉండడం, ఈయన శిష్యులకే ఒకప్పుడు ఇబ్బందిగా అనిపించేది. ఈయన ఆశయం, మైసూరు మహారాజావారి 'శ్వేతచ్ఛత్రం' క్రింద సమైక్య కర్నాటకం ఏర్పడాలని. చనిపోవడానికి కొన్నినెలలముందు శ్రీకంఠయ్యగారి ఉద్దేశంలో కొంతమార్పు

వచ్చినట్టు, ఈమధ్య డా॥ ఆర్. ఎస్. ముగళి చెప్పారు. శ్రీ కంఠయ్యగారు చనిపోయేరోజున డా॥ ముగళి, ఆయనతో చాలాసేపు మాట్లాడారు. సమైక్య కర్నాటకం మైసూరు మహారాజు పాలనకిందే ఉండాలనేటట్టయితే, దాన్ని సాధించడానికి రాజకీయవేత్తలు హృదయపూర్వకంగా పని చెయ్యరేమోనని శ్రీ కంఠయ్యగారు భయపడ్డారని ఆయన నాకు చెప్పారు. ఆ కాలంలో శ్రీ కంఠయ్యగారి మనస్సులో ప్రధానంగాఉన్న అభిప్రాయం ఏమిటంటే, మహారాజుగారి ఆధిపత్యం ఉన్నా లేకపోయినా, సమైక్య కర్నాటకం ఏర్పడటం ముఖ్యం. అయితే ఆ రోజుల్లో సమైక్య కర్నాటకమన్నది, ఏ రూపంలో నయినా, ఏర్పడటమన్నది దాదాపు ఒక కలగా ఉండేది. అందు చేత మహారాజుపట్ల మొగ్గచూపే శ్రీ కంఠయ్యగారి మీదే కొంతవరకు ఆశ పెట్టుకున్నారు. ఇది ఇలా ఉండగా, శ్రీ కంఠయ్యగారి చలవవల్లా పరిషత్తు కార్యకలాపాల చలవవల్లా,కర్నాటకంలోని అన్ని ప్రాంతాలనుంచి పండితులూ విద్యార్థులూ తరుచుగా సమావేశమవుతూ తమ అభిప్రాయాలు పరస్పరం తెలియజేసుకొంటూ ఉండేవారు. దానికదే ఒక లాభం.

అధ్యాపకులుగా శ్రీకంఠయ్యగారిని గురించి నాలుగుముక్కలు చెప్పి ఈ అధ్యాయం ముగిస్తాను. ఆయనదగ్గర చదువుకొన్న విద్యార్థు లెప్పుడూ, క్లాస్‌రూమ్ ప్లాట్‌ఫారంమీద ఆయన ఎలా ఉండేవారో తలుచుకుని సంతోషిస్తూ ఉంటారు. అధ్యాపకులుగా ఆయన గడిపిన జీవితంలో తొలి దశాబ్దిలో ప్రపంచంతో కలవకుండా ఏదో ఒంటిస్తంభం మేడలో ఉంటూ, అవసరమైనప్పుడు మాత్రమే కిందికి దిగివచ్చే మునిలా అనిపించేవారు. రెండో దశాబ్ది చివరికాలంలోనూ ఆ తరవాతా, ముఖ్యంగా కన్నడ భాష బోధించే గౌరవాచార్యులుగా పనిచేసేరోజుల్లో ఆయన వెనకటికంటె చనువుగా ఉండేవారని చెబుతారు. ఆయనతోబాటు లెక్చర్ కాంపుల్లో ఉన్న నాబోటివాళ్ళ అనుభవం కూడా అదే. క్లాస్‌రూమ్‌లో పాఠం చెప్పేటప్పుడు ఆయన, చెప్పే విషయంలో నిమగ్నులయి ఉండేవారుతప్ప శ్రోతలమీద దృష్టి పెట్టుకునే వారుకాదు. ఆయన దృష్టిలో బోధన అంటే, కేవలం పాఠ్యభాగంలో ఉన్నది అవగాహన చేసుకోడమూ దాన్ని వ్యాఖ్యానించడమూ మట్టుకే కాదు. పాఠ్యభాగమన్నది సువిశాలమైన ఆలోచనా సంవేదనల లోకానికి ఎగిరిపోడానికి కాలూనే ఆధారపీఠమన్నమాట. చక్కని ఒక పదచిత్రమో, ఆలోచన రేకెత్తించే పదబంధమో పాఠంలో వస్తే చాలు, అక్కడినుంచి ఆయన

ఉపన్యాసం ఎక్కడెక్కడికో సాగుతుంది. అత్యద్భుతమైన విషయాలు మన కళ్ళకు కట్టిస్తారు. కాని ఏమాటకామాటే చెప్పుకోవాలి; ఆ విషయాలు పాఠ్య భాగంలోంచే పుట్టుకురావలసిన అవసరంలేదు. రెండింటికీ చూపించే సంబంధం బలహీనంగా ఉంటుంది. ఆయన 'పక్కదారి' పట్టిస్తారని కొందరి ఫిర్యాదు. అయితేనేం? దానివల్ల మాకెంత లాభం కలిగిందని! దృక్పథం ఎంత విశాలం అయిందని!

కాని అంతకంటె తరుచుగా, చదివే పద్యమే ఆయనలో ఉత్సాహం కలిగించేది. 'The spirit that dwells in the light of setting suns" "The young lambs bound as to the tabor's sound" లాంటి పద బంధాలు కేవలం ఒక భావాన్ని అందించే మాటల మూటలు కావు; అవి సంగీతంగా పర్యవసిస్తాయి; ప్రతి భావం ఒక ఆధ్యాత్మిక అనుభూతిగా మారుతుంది. ఆయనలో ఒక గమ్మత్తు ఉంది; తరుచు కళ్ళు మూసుకుంటూ ఉండేవారు. దానివల్ల ఆ అనుభూతిని కేవలం మాకు అందించడమే కాకుండా ఆయన దాంట్లో జీవిస్తున్నట్టు ఉండేది. నాకు ప్రత్యేకంగా జ్ఞాపకంవచ్చే విషయం ఒకటి ఉంది. ఎం. ఏ. క్లాసులో ఒకనాడు, మాథ్యూ ఆర్నాల్డ్ పాఠం చెబుతున్నారాయన. అందులో, డాంటీని ఉదాహరిస్తూ చెప్పిన మాటలు వచ్చాయి – "In His will is our peace" వాక్యం చదివిన తరవాత ఆయన ఆగారు; కళ్ళు మూసుకున్నారు; "In His will is our peace. In His will is our peace" అంటూ తమలో తాము మననం చేసుకున్నారు. డాంటీ పలుకులు మనస్సుకు పట్టించుకున్నట్టు స్పష్టంగా తెలిసింది. మరో రోజున బి. ఏ. క్లాసులో, వర్డ్స్వర్త్ వ్రాసిన 'The still sad music of humanity" - అన్న విషయం ఎత్తుకున్నారు. పీరియడ్ అయి పోయిందని చెప్పడానికి గంట మోగింది; కాని ఆ సంగతే మాకు తెలియ లేదు. ప్రొఫెసరుగారు ఉపన్యాసం ఆపేశారు; అరనిమిషం పైగా అలాగే నిశ్చలంగా నించున్నారు. మామూలుగా క్లాసు అయిపోయిన తరవాత కలగవలసిన సంచలనానికి బదులు పూర్తిగా నిశ్శబ్దం ఆవరించింది. క్లాసు ఇంకా ఉపన్యాస ప్రభావంలోనే మునిగి ఉంది; అలాగే ప్రొఫెసరుగారు కూడా. కొన్నేళ్ళ తరవాత, ఆనాటి నిశ్శబ్దాన్ని గురించి నేను ఆయనకు గుర్తు చేసినప్పుడు ఇలా అన్నారు! "ఔను. ఒకటి రెండు సార్లు అలా జరిగి నట్టు నాకు జ్ఞాపకం. అటువంటి నిశ్శబ్దాలకు కృతజ్ఞులమై ఉంటాం."

# 3

# రచనలు

## ఇంగ్లిషు గీతగళు

ఇంగ్లిషు, గ్రీకు సాహిత్యాల్లోని గొప్ప రచనలను కన్నడంలోకి తెచ్చే కష్టతరమైన పనికి పూనుకోడానికి తయారుగా, శ్రీ కంఠయ్యగారు చిన్న గీతాల అనువాదంతో ప్రయోగం ప్రారంభించి ఉంటారు. ఆయన మద్రాసులో విద్యార్థిగా ఉండే రోజుల్లోనే, అలాంటి పని చెయ్యడానికి ప్రణాళిక వేసుకుంటూ ఉండేవారు. 'ఇంగ్లిషు గీతగళు' లో ఉన్న మూడు రచనలు, మొదట 1919 లో 'విద్యాదాయిని' అనే మాసపత్రికలో వచ్చాయి. ఆ అనువాదాలు అంతకు పూర్వం అనేక సంవత్సరాల కిందట చేసినవని ఆయనే చెప్పారు. పన్నెండు రచనలు 1921 లోను, మరో ఇరవై నాలుగు 1924 లోను వెలువడ్డాయి. 1926 లో వీటినన్నిటినీ సంపుటిచేసి, 'ఇంగ్లిషు గీతగళు' అన్న పేరుతో ప్రచురించారు. దీన్ని ప్రచురించిన ఖ్యాతి, బెంగుళూరులో ఉన్న సెంట్రల్ కాలేజివారి 'కన్నడ సంఘ' కు దక్కుతుంది. ఆకుపచ్చ రంగుగల పల్చటి కాగితంఅట్ట పెట్టి 1921 లో అచ్చువేసిన సన్నటి పుస్తకం—ఈ గ్రంథకర్తతో సహా—చాలామంది, యూనివర్సిటీల్లోనూ స్కూళ్ళలోనూ చదివారు. విద్యావంతులైన కన్నడిగులకు, ఈ శతాబ్ది రెండో దశకంలో ఉత్సాహజనకమైన అనుభవాలు రెండు కలిగాయి. ఇంగ్లిషు గీతాలు చదవడం ఒకటి, మాస్తి వెంకటేశ అయ్యంగార్ కథానికలు చదవడం ఒకటి. పద్యగద్యాలు రెండూ ఆశ్చర్యం కలిగిచేటంత సరికొత్తగా ఉన్నాయి. నా స్నేహితుడైన ఒక ముసలాయన ఒకసారి, తొలికాలపు కన్నడ కవిత్వాన్ని గురించి ఉద్రేకంగా అన్నమాటలు నా కిప్పటికీ జ్ఞాపకం; దాన్ని 'రాయ కేళింద' (రాజా, అవధరింపుము) సాహిత్యం అని వెక్కి

రించాడు. అవధానం నిలకడగా ఉండని రాజుకు వినిపించడానికి వ్రాసిన క్షీణయుగపు పురాణ సాహిత్యం అని ఆయన భావం. ఆయన చేసిన ఆ వ్యాఖ్య మూకుమ్మడిగా అన్నదనీ, అన్యాయంగా ఉందనీ ఆయనక్కూడా తెలుసు. కాని కొంతకాలంగా కన్నడ సాహిత్యం, ప్రశాంత సముద్రంలో నిలిచిన ఓడలా ఉంటూ వచ్చిందన్నది కూడా నిజం. 'ఇంగ్లీషు గీతగళు' వెలువడటంతో,

'హాయిగా వీచింది గాలి, తెల్లగా పారింది నురుగు
స్వేచ్ఛగా సాగింది నాగలి.'

కొత్త సముద్రంలోకి మొట్టమొదట చొరబడింది శ్రీ కంఠయ్యగారొక్కరే కాదు. మన స్కూళ్ళూ కాలేజీలూ అప్పటికే, మొదటి భాషగా ఇంగ్లీషు నేర్పుతూ, పాశ్చాత్యుల పద్ధతుల్లో నడుస్తున్నాయి. అంతకు ముందు ఇవి అనువాదం అయిఉండకపోతే ఆశ్చర్యపడవలసిందే. శ్రీ కంఠయ్యగారు పుట్టకముందే షేక్స్‌పియర్ నాటకాలకు కన్నడ పాఠాలు వెలువడటం మొదలైంది. 1903 లో ఆయన బి. ఏ. డిగ్రీ తీసుకోడానికి ముందే, షేక్స్‌పియర్ వ్రాసిన 'రోమియో అండ్ జూలియట్, ఒథెల్లో, కింగ్ లియర్, మాక్బెత్' వంటి నాటకాలు అనువాదమయి, వాటిలో కొన్నిటిని ప్రదర్శించడం కూడా జరిగింది. రొమాంటిక్ (కాల్పనిక) కవుల ఆకర్షణకూడా కొంతపని చేసింది. ఈ శతాబ్ది మొదటి దశకంలో ప్రచురించిన కన్నడ పాఠ్యపుస్తకాల్లో 'ది బెటర్‌లాండ్' (మిసెస్ హేమన్స్), వర్డ్స్‌వర్త్ వ్రాసిన 'టు ది కకూ' అన్న వాటి అనువాదాలు ఉండేవి. వచనమూ పద్యమూ కూడా గొప్ప సుకుమారంగా వ్రాయగలిగిన ఎస్. జి. నరసింహాచార్‌గారే వీటిని వ్రాసి ఉండవచ్చు. ఇలాటి పద్యాల గురించి శ్రీ కంఠయ్యగారికి తెలుసు

ఇంగ్లీషు గీతాల్ని కన్నడంలోకి అనువాదం చేసిన మార్గదర్శుల్లో మరొకరు హెచ్. నారాయణరావుగారు. ఆయన అనువాదాలు కేవలం అలవోకగా చేసినవి కావు. కన్నడ సాహిత్యం పట్టవలసిన దారిని గురించి యోచించి, గతానుగతికమైన శక్కిలనూ వస్తువులనూ ఛందస్సులనూ విడిచి పెట్టవలసి ఉంటుందని భావించారు. తాము రచించిన 'ఆంగ్ల కవితాసార' (ఇంగ్లీషులో ఉత్తమ కవిత్వం) అనే పుస్తకానికి వ్రాసిన పీఠి

కలో ఇలా అన్నారు: "అక్కడక్కడ నేను కొన్ని విడిచిపెట్టాను; కొన్ని అనుకూలమైన మార్పులు చేశాను. మన పూర్వులు అప్పుడప్పుడు కొత్త కన్నడ ఛందస్సులు రూపొందిస్తూ వచ్చారు. అలాగే మనం కూడా కొత్త దారులు ఎందుకు తెరవగూడదని సులభీకరణ ప్రియులు భావిస్తున్నారు."[1]

నారాయణరావుగారు, ఆంగ్ల సాహిత్యంనుంచి స్ఫూర్తి పొంది, నూతనమార్గ నిర్మాణానికి పూనుకొన్నారు. నారాయణరావుగారు కాని, శ్రీ కంఠయ్యగారు కాని ఒకరి కృషిని గురించి ఒకరు ఎరిగి ఉండరు. నారాయణరావుగారితోబాటు పంజె మంగేశరావుగారిని, ఎం. గోవిందపాయ్ గారిని గురించి కూడా చెప్పాలి; 'ఆదిప్రాస' (పద్యపాదం ఆరంభంలోవచ్చే ప్రాస; అంటే పద్యంలో ప్రతిపాదంలోనూ రెండో అక్షరం ఒకటే ఉండడం) పరిహరించాలని వీరు 1911 లో చేసుకొన్న తీర్మానం చాలా సాహసంతో కూడిన నిర్ణయం. సాహిత్యంలోని పాతపద్ధతులమీద అసంతృప్తి అంతకు ముందునుంచే ఉంది; కొత్త ప్రభావాలు ప్రసరిస్తూనే ఉన్నాయి. 'ఇంగ్లీషు గీతగళు' వాటికి కేంద్రమైంది. ఈ సంపుటానికి ఉన్న ప్రభావాన్ని ఇంగ్లీషు కవిత్వంలో 'లిరికల్ బాలెడ్స్' అన్న గ్రంథానికున్న ప్రభావంతో పోల్చడం సమంజసంగానే ఉంది. ఈ కొత్త ఉద్యమాన్ని, కన్నడ కవిత్వంలో పునరుజ్జీవనోద్యమమని అంటారు. ఆంగ్ల సాహిత్యాధ్యేతలు దీన్ని రొమాంటిక్ రివోల్ట్ (కాల్పనికమైన తిరుగుబాటు) అంటారు[2].

'ఇంగ్లీషు గీతగళు' అన్న సంపుటిలో అరవై ఖండికలున్నాయి - షెల్లీవి తొమ్మిది; బర్న్స్‌వి ఏడు, వర్డ్స్‌వర్త్‌వి ఐదు, బ్రౌనింగ్, టెన్నిసన్, స్కాట్ వ్రాసినవి మూడేసి; షేక్స్‌పియర్, సౌదీ, బైరన్‌లవి రెండేసి; తక్కినవి ఇతర కవులవి. ఆంగ్ల సాహిత్యం చదువుకున్న వాడెవరయినా, ఇందులో ఎన్నుకున్న ఖండికల పేర్లు యథాలాభంగా చూసినట్లయితే ఆశ్చర్యపోతాడు. ఉన్న అవకాశం పరిమితమైందని తెలిసికూడా శ్రీ కంఠయ్య

1. హెచ్. నారాయణరావుగారిని గురించి, గోవిందపాయ్ గారిని గురించి నేనిక్కడ చెప్పిన విషయాలకు ప్రొ॥ టి. ఎన్. శ్రీకంఠయ్యగారికి కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. ఇక్కడ నేను అనువాదం చేసిన కన్నడ భాగం, 'ఇంగ్లీషు గీతగళు' తాలూకు 1953 కూర్పుకు వ్రాసిన ఉపోద్ఘాతంలో, ఉదాహరించినది.

2. కన్నడ నాటకంలో వచ్చిన తిరుగుబాటు వాస్తవికమేకాని కాల్పనికం కాదని ఈ సందర్భంలో గమనించాలి.

గారు, The Loss of Royal George (Kempenfelt ఎంతటి వీరుడైనప్పటికీ కన్నడపాఠకుడికి ఎలా ఉపకరిస్తాడు ?), 'Ye Mariners of England' Rule Brittania' 'My England' అన్నవి ఎందుకు ఎంచుకున్నట్టు? The Solitary Reaper' 'La Belle Dame Sans Merci' 'The West Wind' 'Ozymandias of Egypt' లాంటివి వదిలేసి ఇవే ఎందుకు ఎంచుకున్నట్టు? వర్డ్స్‌వర్త్ వ్రాసిన లూసీ పద్యాలంటే ఆయనకి ఇష్టమని మనకు తెలుసు; వాటిని ఎందుకు విడిచిపెట్టినట్టు?

రెండు మూడు జవాబులు చెప్పవచ్చు. ఒకటి, పీఠికలో ఆయనే చెప్పింది; అది పూర్తికాకపోవచ్చు: "ఇందులో తీసుకున్న పద్యాలు ఎంపిక చెయ్యడానికి కారణం, ఇంగ్లీషు సాహిత్యంలో ఇవే ఉత్తమమైనవని కాదు; గొప్ప కవులందరినీ ఇందులో చేర్చాననీ కాదు. నేను చదువుతున్నప్పుడు కొన్ని గీతాలంటే నాకు ఇష్టం కలిగింది; అవి 'నా శక్తికి మించినవి కావు' అనిపించింది. అలాటివే ఇందులో చేర్చాను. ప్రణయాన్ని గురించి ఆంగ్ల కవులు ఎంత హుందాగా, ఎంత సున్నితంగా, సహజంగా వ్రాస్తారో చూపించాలని అనుకున్నాను. కనక ఈ ఎంపికలో, అలాటి కవితలే ఎక్కువ ఉన్నాయి." ఇంగ్లండుమీద తమకున్న అభిమాన్ని ఆయన దాచి పెట్టుకోలేదు; ఆ అభిమానం వల్లనే 'ఇంగ్లండ్, మై ఇంగ్లండ్' లాటి కవితలు అందులో చేరాయి. 'నా శక్తికి మించినవి' అన్న మాటల్లో ఉన్న విషయం, ఈ కవితల ఎంపిక విషయంలో ఇంక ఎలాటి ప్రశ్నలూ తలెత్తకుండా చేస్తుంది. మరికొన్నేళ్లు పోయిన తరవాత అయినా, 'నా శక్తికి మించినవి కావు' అనిపించే కవితలు మరికొన్ని ఆయనకు కనిపించి ఉండవా అని ఒక్కొక్కప్పుడు అనుకునేవాణ్ణి. కాని మూడోదశకంలో కూడా రచన చెయ్యడానికి ఆయన ఇంకా ఎక్కువ టైము వినియోగించినప్పటికీ – దురదృష్ట వశాత్తు, అలా జరగలేదు కాని – బహుశా ఆయన ఎన్నుకునేవి గీతాలు అయి ఉండవు; ఆషిలస్, షేక్స్‌పియర్ వ్రాసిన నాటకాలే తీసుకుని ఉండేవారు.

అనువాదాలన్నీ ఉన్నత ప్రమాణంలో ఉన్నవికావు. కొన్ని మాత్రం, అనువాదకళలో అత్యుత్తమ ప్రమాణాలకు నిదర్శనంగా నిలుస్తాయి. నిజానికి, ఒకటి రెండింటి విషయంలో, "కవిత్వ అనువాద ప్రక్రియకు లొంగదు" అన్న వాడుక తారుమారు అయిందని గమనించకపోము. కొంచెం అతిశ

యోక్తి ఉన్నప్పటికీ పరవాలేదనుకుంటే, "అనువాద ప్రక్రియలో ఇనుమడించే కవిత్వం ఇదుగో" అని చెప్పవచ్చు. వర్డ్స్‌వర్త్ వ్రాసిన 'రిటెన్ ఇన్ మార్చ్' అన్న కవితకు ఈయన చేసిన అనువాదం తొలి ప్రయత్నమే అయినప్పటికీ, మూలానికి విరుద్ధంగా ఛాందసమైన ఛందస్సులో వ్రాసిందే అయినప్పటికే, దాంట్లో ఉన్న సరళమైన శైలిలో అందం, ప్రబోధ గుణం మనల్ని ముగ్ధుల్ని చేస్తాయి. న్యూమన్ వ్రాసిన 'లీడ్ క్రైండ్లీ లైట్', హూడ్ వ్రాసిన 'ది బ్రిడ్జ్ ఆఫ్ సైస్' అన్న కవితలకు ఆయన చేసిన అనువాదాలు కర్నాటకంలో బాగా ప్రాచుర్యం పొందాయి. వీటిలో రెండోది, శైలి విషయంలోను, భావనాబలంలోను, పరాకాష్ఠనందిన కరుణం విషయంలోను మూలాన్నే తలదన్నిందని చెప్పవచ్చు.

ఆయన అనువాద ప్రతిభకు నిదర్శనంగా చెప్పదగ్గ మూలకవితలు ఇవి: వర్డ్స్‌వర్త్ వ్రాసిన 'ది సెవెన్ సిస్టర్స్'; లేడీ లిండ్సే వ్రాసిన 'ఓల్డ్ రాబిన్ గ్రే'; కోలెరిడ్జ్ వ్రాసిన 'లవ్'; ఒకరకంగా వాటికి భిన్నమైనప్పటికీ సమాన ప్రతిభను నిరూపించే గీతం, స్కాట్ వ్రాసిన 'గేదరింగ్ సాంగ్' అన్నవి. వీటితోబాటు ప్రత్యేకంగా నేను ఉదాహరించదలుచుకున్నది మరొకటి ఉంది: స్కాట్ వ్రాసిన 'ప్రౌడ్ మెయిసీ ఇన్ ది వుడ్' అన్నది. 'ది సెవెన్ సిస్టర్స్', 'లవ్' అన్నవాటితోబాటు ఇది కూడా నాకు చాలా ఇష్టమైన కవిత. ఇది మూలంలో ఉన్న పటిష్ఠతను, శక్తిని నిలుపుకోడమే కాకుండా, సంపూర్ణమైన సహజత్వాన్ని గడించుకుంది.

షెల్లీ కవితలకు చేసిన అనువాదాలు సాధారణంగా అసంతృప్తే కలిగిస్తాయి. బర్న్స్‌వి ఒకటి రెండు కవితలు బాగున్నాయి. విజయాలు అధికంగా ఉన్నప్పుడు అపజయాల్ని ఉపేక్షించాలనిపిస్తుంది. తాము ఎక్కడ విఫలమైందీ శ్రీ కంఠయ్యగారికే తెలుసు. తమ వైఫల్యాల్ని కూడా ప్రయోగాలుగా మనకి చూపించారాయన. కన్నడ కవులకవి గుణపాఠాలు నేర్పాయి.

'ఇంగ్లీషు గీతగళు' జీవిస్తాయి. వాటిలో ఉన్న సహజమైన విలువల వల్లా, ఇంతకంటె ఎక్కువగా చారిత్రక ప్రాముఖ్యంవల్లా అవి తప్పకుండా జీవిస్తాయి. కవి భావవృత్తిని ఒక నిశ్చితమైన ఛందస్సులోకి బలవంతాన కుదించకుండా, ఎంచుకొన్న ఛందస్సే భావవృత్తిని వ్యక్తం చేసేటట్టు ప్రదర్శించారాయన. లయ, ఛందస్సు కవి అవసరాల్నిబట్టి మారుతుంటాయి.

వివిధ ఛందస్సుల్ని నిర్వహించడంలో ఈ నాడు కన్నడ కవులు అనుభ వించే గొప్ప స్వేచ్ఛకు భిక్ష పెట్టినవారు శ్రీ కంఠయ్యగారు. 'ఇంగ్లీషు గీత గళు' వెలువడ్డ తరవాత, దాదాపు మర్నాటినుంచే 'హఠాత్తుగా ప్రతివాళ్ళూ వాటినే పాడటం మొదలుపెట్టారు.' కంటికీ, చెవికీ జీవం వచ్చింది. మామిడిపువ్వు, కోయిలపాట, రంగుల సింగిణీ, పంట పొలానికి ఊపిరిపోస్తే పైరగాలి – కంటికి కనిపించాయి, చెవులకు వినిపించాయి; అవి పెట్టెల్లో దాచిపెట్టిన నగలలా ఉండేరోజులు పోయాయి. మహాకావ్యం ముందు గీతం తీసికట్టుగా కనిపించవలసిన అవసరం లేదింక; తన రాజ్యం తాను ఏర్ప రుచుకుంది. కవిత్వంలో ఏ విషయంమీద నయినా ఏ భావవృత్తినయినా ప్రదర్శించవచ్చుననీ, శైలిలో సారళ్యానికి కూడా ఒక అందం ఉందనీ, కవి కావాలంటే పండితుడు కూడా అయి తీరాల్సిన అవసరంలేదని కని పెట్టడం జరిగింది.

ఈ నవ్య రచన చాలావరకు సామాన్యమైన కవిత్వం; స్వభావతః కేవలం మానవుడి ఉల్లాసంకోసం మానవుణ్ణి మానవుడిగా చిత్రిస్తూ వ్రాసి నది. ఈ ఉల్లాసానికితోడు, అతీతంగావున్న 'మానవ విషాద సంగీతం' కూడా వినిపించింది. పదాడంబరంతో కూడిన క్షీణ యుగపు మహాకావ్యం స్థానాన్ని ఇవి కొంతకాలంవరకు ఆక్రమించుకున్నాయి. అయితే మహా కావ్యానికి కూడా ఇవి పుష్టినిచ్చాయి. రెండు దశాబ్దుల తరవాత శ్రీకువెంపు (డా॥ కే. వి. పుట్టప్ప) వ్రాసిన 'శ్రీరామాయణ దర్శనం' తో మహాకావ్యం, కొత్త చూపుతోనూ హుందాతనంతోనూ మళ్ళీ పూర్వవైభవం సంతరించు కొన్నది.

కర్నాటక సాహిత్య చరిత్రలోని ప్రయోజనకరమైన విప్లవాలలో 'ఇంగ్లీషు గీతగళు' ప్రచురణ ఒకటి అని ఎప్పటికీ గుర్తు చేసుకుంటారు.

## గదాయుద్ధ నాటకం

ఐదంకాల ఈ నాటకాన్ని 1925 లో ప్రదర్శించారు; 1926 లో ప్రచురణ జరిగింది. ఇదే, పదో శతాబ్దినాటి రన్న వ్రాసిన 'సాహసభీమ విజయ' అనే కావ్యాన్ని ఆధారం చేసుకొని వ్రాసింది; దాని సారమే ఇది అని చెప్పడం, ఇంకా నిజం. రన్న వ్రాసినది చంపూ కావ్యం; అంటే,

పద్యాలతోనూ వచనాలతోనూ కూడినది అని అర్థం. దీని కావ్యవస్తువు మహాభారతంలోది. రన్నకు సన్నిహితమైన ఆధారాల్లో అన్నిటికన్న ముఖ్యమైనది పంప వ్రాసిన 'విక్రమార్జున విజయ'; మామూలుగా దీన్ని 'పంపభారత' మనే అంటారు. రన్న వ్రాసిన మహాకావ్యంలో చక్కటి నాటకీయత ఉన్న సంగతి గమనించారు, శ్రీ కంఠయ్యగారు. అందులో ఉన్న నాటకాన్ని విడదీసి దానికొక స్వతంత్రవ్యవస్థ కల్పించారు. శైలి విషయంలోను, కవితాగంధం విషయంలోను రావలసిన ప్రతిష్ఠ దాదాపు అంతా రన్నకే దక్కాలి. కేవలం పరిమాణాత్మక దృష్టితో చూసినట్లయితే, ఈ నాటకంలో కవిత్వం తక్కువేననికూడా చెప్పవచ్చు. చంపువుకంటె నాటకం పకడ్బందీగా ఉండవలసిన అవసరంవల్ల శ్రీకంఠయ్యగారు చాలా చక్కటి భాగాలను కొన్నిటిని పరిహరించవలసి వచ్చింది.

నాటకరూపాన్ని మినహాయిస్తే, శ్రీకంఠయ్యగారు సొంతంగా చేసినదల్లా, పద్యాల క్రమంలో సందర్భానుసారమైన మార్పులకూ, మూలం నుంచి తీసుకొన్న భాగాల్ని కలపడానికి అక్కడొక వాక్యం, ఇక్కడొక వాక్యం చొప్పించడానికీ మించి ఏమంత ఎక్కువలేనట్టే కనిపించవచ్చు. "ఆయన రన్న కావ్యంలోంచి కొన్ని భాగాలు ఎంచి తీసుకొని, విషయాన్ని అంకాలుగా విడగొట్టుకుని రాశారు. అంతకంటె ఎక్కువ ఏమయినా చేశారా?" అని అనాలని ఎవరికయినా అనిపించవచ్చు. చేశారు; కొన్ని తీసెయ్యడం, కొన్ని ఎంపిక చేసుకోడం మట్టుకేకాదు. కొన్ని భాగాల స్థానం మార్చడంవల్లా, ఒక పాత్ర చెప్పేది మరో పాత్రచేత చెప్పించడంవల్లా కూడా నాటకంలో అర్థం మొత్తం మారుతుంది. నాటకం చదివిన తరవాత మన మనస్సుమీద పడే ముద్ర, కావ్యం చదివిన తరవాత కలిగేదానికి భిన్నంగా ఉంటుంది. కాబట్టి ఈ నాటికి ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్నట్టుగానే గుర్తించి పరిశీలించవలసి ఉంటుంది.

నాటకంలో సాగే నటన, చంపూకావ్యంలో ఉన్నదీ ఒకటే. సంఘటనలు కూడా దాదాపు అదే క్రమంలో ఉంటాయి. కౌరవ పాండవ యుద్ధం దాదాపు అయిపోయినట్టే. కౌరవ పక్షంలోని సైన్యాధిపతులు—ద్రోణుడు, కర్ణుడు, శల్యుడు—అందరూ చనిపోయారు. వాళ్ళలో అందరికంటె గొప్పవాడూ అజేయుడూ అస్త్రసన్యాసం చేసినవాడూ అయిన భీష్ముడు

మరణఘడియకు ఎదురుచూస్తూ అంపశయ్యంమీద ఉన్నాడు. ధృతరాష్ట్రుడి నూరుగురు సంతానంలో మిగిలినవాడు దుర్యోధనుడొక్కడే. ఈ నాటకానికి సంబంధించినంతవరకు, రాజును సేవించడానికి మిగిలినవాడు, ఏకైక యోధుడు, అశ్వత్థామ ఒక్కడే. పాండవులు యుద్ధంలో గెలిచారు. కాని, వాళ్ళ రాణి ద్రౌపదికి తృప్తికలగలేదు. ధర్మరాజు భీముణ్ణి శాంతర్చిపరిచి, దుర్యోధనుణ్ణి శిక్షించకుండా విడిచిపెట్టేటట్టు చేస్తాడేమో నన్న భయంతో నాటకం మొదలవుతుంది. దుర్యోధనుడు తనను పనిగట్టుకొని అవమాన పరచడానికే గుడ్డతీసి తొడచూపించాడన్న విషయం ద్రౌపది మరిచిపోలేదు. ఆ తొడ విరుస్తానని ప్రతిజ్ఞ చేసిన భీముడు, ఆ ప్రతిజ్ఞను పాటిస్తానని ఆమెకు మాట ఇచ్చాడు. పగ తీర్చుకోవాలని ద్రౌపదికి ఉన్న కోరికకు బలం ఇస్తూ, ఆ రోజు సూర్యాస్తమయంలోగా దుర్యోధనుణ్ణి చంపకపోయినట్లయితే అతడు జయించడానికి శక్యంకానివాడవుతాడని భీముడికి చెప్పాడు. మొదటి అంకంలో, భీముడు తన ప్రతిజ్ఞ నిలుపుకోడానికి పూనుకోడం గమనిస్తాం.

రెండో అంకంలో దుర్యోధనుడు, తనను ద్రోణుడూ అశ్వత్థామా దగాచేశారని కటువుగా దూషించడం చూస్తాం. సంజయుడు పాండవులను పొగడటం, వాళ్ళమీద—ముఖ్యంగా భీముడిమీదా కృష్ణుడిమీదా—చెలరేగే దురాగ్రహానికి సంకేతం. వెనక తాను వాళ్ళకు చేసిన అవమానాల నన్నిటినీ తిరగదోడుతూ, ఆ పిరికిపందలు వాటిని చచ్చినట్టు భరించారంటాడు. అయితే ఏదైనా చర్య తీసుకోబోయేముందు భీష్మణ్ణి సంప్రదించడానికి అంగీకరిస్తాడు.

భీష్ముడు పడి ఉన్న చోటికి దుర్యోధనుడు సాగడంతో మూడో అంకం మొదలవుతుంది. దారిలో, పీనుగులతో పొట్టనింపుకొనే పిశాచాలు మూడు కనిపిస్తాయి. అవి అతను చేసిన పాపాలు గుర్తుచేసి ఎత్తిపొడుస్తూ, నువ్వు బతికేది సూర్యాస్తమయం దాకానే అని చెబుతాయి. కర్ణదుశ్శాసనుల కళేబరాలు చూసినప్పుడు దుర్యోధనుడు బాగా చలించిపోతాడు. అభిమన్యుడి శరీరం కంటబడినప్పుడు, ఆ వీరకుమారుణ్ణి ఉదారంగా పొగుడుతాడు సంధిచేసుకోమని భీష్ముడు అతనికి సలహా ఇస్తాడు. దుర్యోధనుడు అలాటి దెప్పుడూ చెయ్యడని గ్రహించి, మర్నాడు వైశంపాయన సరోవరంలో దాక్కోమంటాడు.

నాలుగో అంకంలోనూ అయిదో అంకంలోనూ భీముడు, కృష్ణుడు, ధర్మరాజు తమ శత్రువుజాడ వెదుకుతూ సరోవరం దగ్గరికి వస్తారు. భీముడి కవ్వింపులు సహించలేక, దుర్యోధనుడు సరోవరంలోంచి బయటికి వస్తాడు. తరవాత గదా యుద్ధం జరుగుతుంది. ఒకసారి భీముడు పడిపోతాడు. ఈ అవకాశాన్ని వినియోగించుకోడానికి దుర్యోధనుడు అంగీకరించక, భీముడికి స్పృహ వచ్చేదాకా తన గదతో విసురుతాడు. యుద్ధం మళ్లీ మొదలవుతుంది. వెనక చేసిన ప్రతిజ్ఞను భీముడికి గుర్తుచేస్తాడు కృష్ణుడు. దాంతో భీముడు దుర్యోధనుడి తొడమీద కొడతాడు. దుర్యోధనుడు పడిపోతాడు. పడిపోయిన శత్రువును కాలితో తంతాడు భీముడు. దానికి భీముడిమీద ప్రతీకారశక్తులు పగబడతాయి. వాటినుంచి అతనికి రక్షణకలిగే నిమిత్తం శివుణ్ణి ధ్యానించడానికి పాండవులు నీలాద్రికి వెళ్తారు.

ఇంతవరకు బాధలేదు. తరవాతి సంఘటన లేకుండా ఉంటే నాటకం ఇంకా బాగుండేది. అశ్వత్థామ ప్రవేశిస్తాడు. మరణ సమయంలో దుర్యోధనుడు వెల్లడించిన కోరిక తీర్చడానికి, పాండవుల తలలు కోసితెస్తానని ప్రతిజ్ఞచేసి వెళ్ళిపోతాడు. కాని అతడు తెచ్చిన తలలు ద్రౌపది కొడుకులవి. నువ్వు పాపం చేశావని చెబుతాడు దుర్యోధనుడు. దేవుడి ముందు మనిషి శక్తి ఎందుకూ పనికిరానిదని గ్రహించి కన్ను మూస్తాడు. పొద్దు కుంకుతుంది.

రన్న కథలో నాటకీయ లక్షణం బలంగా ఉంది. కావ్యవస్తువు విషాదాత్మకమైనది. పురాణ కావ్యనాయకుల గాఢవాంఛాప్రవృత్తులు, రాక్షస ప్రవృత్తులు కూడా; బలవంతులు సంపద కోల్పోవడం; పరాజయం, బాధ, మరణం, వినాశానికి దారితీసే తప్పు; విధి–విషాదాత్మక నాటకానికి ఉండవలసినవన్నీ దీంట్లో ఉన్నాయి. రన్నకు ఇవి మూలంలోంచే సంక్రమించాయి. రన్న రచనను విషాదాత్మకమైన ప్రాచీన నాటక పక్కిలో రూపొందించవచ్చునని శ్రీకంఠయ్యగారు గ్రహించారు. నాటకంలో, నటనకు ఆరంభమూ అంతమూ ఒక రోజునే జరుగుతాయి. నాటకం మొత్తం యుద్ధరంగంలోనే సాగుతుంది. వర్ణనలోనూ కథాకథనంలోనూ అనవసరమైనది తీసేస్తే విషాదాత్మక నాటకం వెల్లడి అవుతుంది.

అయితే శ్రీకంఠయ్యగారు ఈ పనికి పూనుకొన్నప్పుడు, ప్రధానమైన సమస్య ఎదురయింది. ఈ విషాదాత్మక నాటకానికి నాయకుడెవరు? రన్న వ్రాసిన చంపూ కావ్యంలో ఈ సమస్యే ఎదురవదు. కవిగారి ఆదరాన్ని చూరగొన్న భీముడే కథానాయకుడు కాకతప్పదు. మహాభారత కథకు భిన్నంగాకూడా రన్న, ధర్మరాజుచేత సింహాసన పరిత్యాగం చేయించి భీముడికి పట్టం కడతాడు. కాని, ఈ చంపూకావ్యాన్ని విషాదాత్మక నాటకంగాచేసే పక్షంలో నాయకుడు కాదగ్గవాడు దుర్యోధనుడు. రంగస్థలం మీద, భీముడికంటె ఇతడే ఎక్కువసేపు కనిపిస్తాడు. విషాదాత్మక నాటక నాయకుడికి కావలసిన లక్షణాలు ఇతడికి ఉన్నాయి—తప్పు; ఉచ్ఛస్థితి నుంచి పతనం కావడం; దయనీయ స్థితిలో ఉండడం; దేవతలుగాని విధిగాని వ్యతిరేకంగా ఉన్నది ఇతడికే. విధి విషయంకూడా అతని సహజ ప్రవృత్తినిబట్టే ఉందని చెప్పాలి. యథార్థ విషయాల్ని కనక సూటిగా చూసినట్లయితే ఇది నిజమన్న సంగతి స్పష్టమవుతుంది. తొడ విరిగి చనిపోతాడని అతనికి ఒక శాపం ఉంది. కాని తన ఔద్ధత్యంవల్ల తానే ఆ స్థితి తెచ్చుకున్నాడు.

దుర్యోధనుడు విషాద నాయకుడి స్థాయికి నిలుస్తాడా? తాను రాజు కావడంవల్ల కేవలం ఆకస్మికంగా వచ్చిన హోదాతప్ప అతనిలో గొప్పతనం ఏమన్నా ఉందా? విషాద నాయకుడు నైతికంగా మంచివాడై ఉండవలసిన అవసరంలేదు. అటువంటి మంచితనం ఉండడంవల్లకాని, లేకపోవడంవల్ల కాని అతడు విషాద నాయకుడు కాలేడు. అలాగే, ఉచ్ఛస్థితినించి పతనం కావడంవల్లా, బాధలు పడడంవల్లా కూడా కాదు. మానసిక స్థితినిబట్టి ఔదార్యంకాని వినయంకాని చూపించే అలవాటు అతనికి ఉంది. కాని అతన్ని ఉన్నత స్థాయిని నిలిపే ఒక గొప్ప లక్షణం కాని, పట్టుబట్టి సాధించదలిచిన గొప్ప ప్రయోజనం కాని ఏదైనా ఉందా?

అతనిలో ఒక లక్షణాన్ని మట్టుకు బాగా ప్రశంసిస్తారు పాండవులకు ఒక్క అంగుళం మేరకూడా ఎన్నడూ ఇవ్వనన్న నిశ్చయం. శత్రువుకు లొంగిపోవడంకంటె చావడమే మంచిదనుకోడం కొంతవరకు హర్షించదగ్గదేనని మనం ఒప్పుకోవచ్చు. అటువంటివాణ్ణి ఈ సందర్భంలో లొంగిపోయేటట్లు చెయ్యడంకూడా నేర్పు అనిపించుకోదు. అలా లొంగిపోవడం

అతని సహజవృత్తికి వ్యతిరేకం. కాని ఆత్మహననానికి పూనుకొని, మూర్ఖంగా దాన్నే పట్టుకొని వేలాడ్డం అతని విషయంలో యథార్థమైనంత మాత్రాన అతనికి విషాద నాయకుడి హోదా వస్తుందా? నాటకంలో రెండం కాల పాటు అతడు దుఃఖించడంతప్ప మరేమీ చెయ్యలేదు. కన్నడ సాహిత్య చరిత్ర మొదటిభాగం ('కన్నడ కైపిడి', సంపుటి 2, పుట. 599) లో శ్రీ కంఠయ్యగారు ఇలా అంటారు: "రన్నకు దుర్యోధనుడి మీద ఉన్న సాను భూతి 'సాహస భీమ విజయ' కావ్యంలో బాగా కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. ఇది నైతిక దృక్పథంవల్ల ఏర్పడ్డ సానుభూతి కాదు—ఇది జాలి." అంత వరకు ఇది నిజమే; 'భయానకత' కాదు, జాలి. దుర్యోధనుణ్ణి పెద్ద చెయ్య డానికి శ్రీ కంఠయ్యగారు పనిగట్టుకుని పూనుకోలేదు; రన్న చేసిందే ఉంచారు. దుర్యోధనుడికి స్థానం ఇవ్వడం వరకు మాత్రమే దయ చూపించారు. తక్కిన విషయంలో దుర్యోధనుడు, రన్న కావ్యంలోకంటె ఉత్తముడూ కాలేదు, అధముడూ కాలేదు.

దుర్యోధనుడి శీలంలో, మన సానుభూతిని, జాలిని పొందే లక్షణా లేమిటో గమనిద్దాం. చంపువులో మాదిరిగానే నాటకంలోకూడా, దుర్యో ధనుడికి, కౌరవ వంశనాయకుడుగా ఒక విశిష్టత ఉందనడంలో సందేహం లేదు. పట్టాభిషిక్తుడైన రాజు అనుభవించే వైభవం, చూపించే ఆడంబరం కన్న అతనికి కాస్త ఎక్కువే ఉండవచ్చు. అక్కడ అవి సార్థకమైనవే. అలాటి స్థితినుంచి పతనం జరిగితే జాలి కలక్కమానదు. అంతేకాకుండా, అతనిలో ఉన్న మంచి గుణాల్నికూడా ప్రదర్శించడం జరిగింది. ఉదా॥ తమ్ముడిమీద అతనికి ఉన్న ప్రేమ, గొప్ప మిత్రుడయిన కర్ణుడిమీద విశ్వాసం. వాళ్ళ సోదరభావం దుష్టమైనదే కావచ్చు. కాని దాన్ని సోదర భావం అనకతప్పదు. వాళ్ళ కళేబరాలు యుద్ధరంగంలో కంటబడినప్పుడు అతడు చలించిపోతాడు. అక్కడ చక్కని కవిత్వం ఉంది. అభిమన్యు కుమారుడిమీద ఔదార్యం చూపిస్తాడు. రెండో రంగంలో అతడు ద్రోణుడి మీదా అశ్వత్థామమీదా మాత్రమే కాదు, భీముడిమీద కూడా కోపం ప్రక టించినప్పటికీ తరవాత పశ్చాత్తాపం చెందిన సంగతి గమనిస్తాం. నాటకం చివరిలో, "దేవుడిముందు మన శక్తి ఎందుకూ పనికిరాదు" అంటూ దైవం

మీదే భారం వేస్తాడు. అతని పలుకుల్లో ప్రశాంత గాంభీర్యం ఉంది; దుర్యోధనుడిలో ఇది చాలా అరుదైన సంగతి.

అంతకంటె ముఖ్యమైన విషయం, నాటకీయంగా ఆకర్షకమైన విషయం ఏమిటంటే, ఈ గదాయుద్ధ సమయంలో, తన గర్భశత్రువైన భీముడిమీదే ఔదార్యం చూపించడం. భీముడు పడిపోయినప్పుడు దుర్యోధనుడు ఇలా అంటాడు "ఇది ధర్మయుద్ధం. పడిపోయినవాళ్ళను కొట్టను నేను కాసేపు ఆగి, నా గదతో వీడికి విసురుతాను." భీముడి పాత్రను విమర్శించడానికి ఈ ఔదార్యగుణాన్ని మెచ్చుకోడం మామూలు. ఇంత ఔదార్యం చూపే శత్రువుని భీముడు, ధర్మవిరుద్ధంగా, దారుణంగా తొడమీద కొట్టలేదూ? ఎంత వ్యత్యాసం! దుర్యోధనుడి ఔదార్యం—సత్యమే అయినట్లయితే—నిజంగా గొప్పదే. కాని ఇక్కడ వచ్చిన చిక్కు ఏమిటంటే, ఇది జరిగే అవకాశం లేదు. మిత్రుడిగా, సోదరుడిగా అతడు మంచివాడే కావచ్చునన్న విషయం ఒప్పుకోడానికి తయారవుతాం. కాని అతని విషయంలో ఇది నమ్మలేం. ఈ దుర్యోధనుడే భీముడికి విషంపెట్టి చంపాలని చూశాడు; పాండవులు నిద్రపోతున్న సమయంలో వాళ్లున్న ఇంటికి నిప్పుపెట్టి వాళ్ళని కాల్చి చంపాలని చూశాడు; జనంతో కిటకిటలాడుతున్న రాజసభలోకి ద్రౌపదిని రప్పించి, దుశ్శాసనుడు ఆమె బట్టలు ఒలుస్తుంటే కామవికారంతో చూశాడు. ఇవన్నీ అతడు, నిబ్బరంగా చేసినవే కాని ఏదో తాత్కాలికమైన ఉద్రేకంలోపడి చేసినవికావు. అటువంటివాడు, తన గర్భశత్రువుతో తలపడి జీవన్మరణ సమస్యగా పోరాడుతూన్నప్పుడు, అతని నీచగుణాలు చెలరేగే అవకాశమున్నప్పుడు, హఠాత్తుగా అతనికి ధర్మబుద్ధి కలిగిందని నమ్మమంటున్నారు.

దుర్యోధనుడి పక్షాన ఒక వాదం చెప్పడం నాకు జ్ఞాపకమే. అతడు కావాలని చేసిన నేరాలన్నీ గతంలో జరిగినవి. తరవాత పదమూడేళ్ళ కాలం గడిచింది. రన్న వ్రాసిన చంపూ కావ్యంలో కాని శ్రీకంఠయ్యగారి నాటకంలో కాని అవి జరగలేదు. వ్యాసుడి చేతిలో తయారైన దుర్యోధనుడు చేసినవాటికి తరవాతి రచయితల జవాబుదారీ లేదు. ఈ వాదానికి మూలం సహజంగా బలమైనదే. ఈ దుర్యోధనుడు పూర్తిగా వేరు. కాని ఈ నేరాలు, వాటికి ప్రేరేపించిన మనస్తత్వం, కాలంగడచినా మరుగున పడలేదు.

ఉత్తరోత్తరా వచ్చిన రచనల్లో ఇవి సమస్యలుగానే నిలిచాయి. వాటినిగురించి ద్రౌపది మాట్లాడుతుంది; అలాగే భీముడూ చెబుతాడు. పశ్చాత్తాపస్థితిలో దుర్యోధనుడే వాటిని జ్ఞాపకం చేసుకుంటాడు. దుష్టత్వమన్నది దుర్యోధను డిలో ఇప్పటికీ నిజంగా ఉంది.

కాని దుష్టుడిలో మాత్రం ఉదారగుణం ఉండదా? ఉంటుంది. అతడు ఉంచుకోవచ్చు. కాని దుర్యోధనుడి విషయంలో అది అసంభవం; సరైన కళాకారుడు దాన్ని పరిహరిస్తాడు. అది సత్యమని అంగీకరించవలసినట్లయితే మనల్ని అందుకు సిద్ధం చెయ్యాలి. రన్న కావ్యంలోను, మన నాటకంలోను దుర్యోధనుడు ఆ ఔదార్యంమీద నిలవలేడు. కాని నిజమేమిటంటే, ఆ ఔదార్యం ఉన్నది రన్న హృదయంలో! క్రూరత్వం మాత్రమేకాదు, దుర్యోధనుడిలో కొన్ని మంచి లక్షణాలుకూడా ఉన్నాయి. మానవ స్వభావంలో ఉండే ఈ సంకీర్ణతను రన్న చిత్రించాడు. నాటకంలో కూడా ఇది ఉంది. రన్న అవసరమైన దానికంటె ఎక్కువగానే దుర్యోధనుడికి న్యాయం చేశాడు; శ్రీకంఠయ్యగారు అతన్ని అనుసరించారు.

అయితే దుర్యోధనుడి ఒంటరితనం చూస్తే మనసు కరుగుతుంది. అతడు జీవించిన ప్రపంచం, సంచరించిన ప్రపంచం, శకుని దుశ్శాసన కర్ణుల ప్రపంచం. పాండవులపట్ల ద్వేషం, వాళ్ళు బాధపడుతుంటే ఆనం దించే గుణం వాళ్ళలో నిండి ఉన్నాయి. ఇప్పుడు ఆ ప్రపంచం భగ్న మయింది. పాండవులు విజయం సాధించారు. క్రౌర్య విషయంలో తనకు సహచరులైన వాళ్ళు గతించారు. అప్పుడతడు ఏడుస్తాడు: "నా మనస్సు ఖాళీగా ఉంది. ఇల్లు ఖాళీగా ఉంది; ఈ విశాల ప్రపంచం ఖాళీగా ఉంది" అంతా ఖాళీగా ఉందన్న సంవేదన కూడా, తనలో విలువయినదంతా తానే నాశనం చేసుకున్నానన్న గ్రహింపువల్ల కలిగింది కాదు. అందుచేత దుర్యోధనుడు జాలి కలిగించవచ్చు. కాని విషాదనాయకుడు కావడానికి తగినంత బలం, తగినంత గొప్పతనం అతనిలో లేవు.

రన్న కావ్యంలో ఉన్న దుర్యోధనుడికి ఎన్ని అవలక్షణాలు ఉన్నాయో, అన్నీ నాటకంలో దుర్యోధనుడికి ఉన్నాయన్న విషయం గమ నించడం చాలా ముఖ్యం. అప్పుడు మనం భీముడి విషయంలో న్యాయం చెయ్యగలమనుకుంటాను. ఇతని చర్యల్ని, విమర్శకులకంటె కూడా నిష్పక్ష

పాతంగా అంచనా వెయ్యవలసి ఉంది. శ్రీకంఠయ్యగారే, కన్నడ సాహిత్య చరిత్ర' లో రన్నకు నివాళులర్పించారు: "ఈయన భీముణ్ని దిగలాగ లేదు, దుర్యోధనుణ్ణి పెంచాడు." ఈ నాటకంలో మట్టుకు భీముణ్ని దిగలాగడం జరిగిందేమోనని అనుమానం. ఉదాహరణకు భీముడు, నాటకంలో మాదిరిగా చంపూ కావ్యంలో మట్టుకు ధర్మరాజును హేళన చెయ్యడు ("ఇడుగో, నీతులు చెప్పేవాడు!"). మహాభారతంలో కూడా భీముడు తరచుగా, ద్వేషరోషాలు వెలిగక్కుతూ, ధర్మరాజు చూపే ధర్మబద్ధతకు సహనం కోల్పోతూ ఉంటాడు. రాక్షసుడిలా పచ్చినెత్తురు తాగే భీముణ్ని మనం ఎరుగుదుం; నేలగూలిన శత్రువు తలకున్న కిరీటాన్ని తన్నే భీముణ్ని మనం ఎరుగుదుం. అతన్ని గురించి తెలుసుకోవలసింది ఇంతమట్టుకే కాదు. కాని ఈ భీముడి స్వభావంలో కొంత, నాటకంలోకి వచ్చింది.

శ్రీకంఠయ్యగారు భీముడిమీద పక్షపాతం వహించారని నిందించడానికి వీలులేదు. అయినప్పటికీ, గదాయుద్ధ రంగం విషయంలో ఆయనకు ఏమంత తృప్తికలిగినట్టు లేదు. దాన్ని చాలా తగ్గించారు. కచ్చితంగా చెప్పాలంటే, భీముడు దుర్యోధనుడి తొడ విరగగొట్టడం ఒక తప్పు; పడిపోయిన శత్రువును తన్నడం ఇంకో తప్పు. అయితే భీముడివంటి పురాణ కావ్య నాయకుల్ని అర్థంచేసుకోడానికి ప్రయత్నించేటప్పుడు, మనం రెండు విషయాలు మనస్సులో ఉంచుకోవాలి. వాళ్ళ స్వరూపస్వభావాలు మానవాతీత స్థాయిలో చిత్రించినవి. వాళ్ళలో ఉండే భావోద్రేకాలు, సామాన్య మానవుల్లో కనిపించేవాటికన్న చాలా భయంకరంగా ఉంటాయి. భీముడికి సహజమైన ఆ మాదిరి భావోద్రేకాలు మననయితే మసిచేసేస్తాయి. మన ప్రమాణాల్ని అనుసరించి వాటిని తీర్మానించగూడదు. (2) ఉత్తి నిర్బలుడికి కూడా పట్టరాని కోపం తెప్పించేటంత కారణం భీముణ్ని రెచ్చగొట్టింది. ద్రౌపదిని కొప్పుపట్టుకొని, మగవాళ్ళతో నిండి ఉన్న రాజసభలోకి ఈడ్చుకు రావడం జరిగింది. సభలో ఉన్న యోధులందరూ చూసేవిధంగా ఆమెను పూర్తిగా నగ్నంగా ప్రదర్శించనందుకు దుశ్శాసనుణ్ని కాని దుర్యోధనుణ్ని కాని మెచ్చుకోనక్కరలేదు. ఇది గుర్తుంచుకొని చూడాలి. ఎవరి ప్రవర్తన సహజంగా ఉందో—భీముడిదా, ఆ సమయంలో ధర్మసూక్ష్మాలు నెమరు వేసుకుంటూ కళ్ళప్పగించి చూస్తూ కూచున్న భీష్మ ద్రోణాదులదా?

ఆ సమయంలోకూడా ఆత్మనిగ్రహాన్ని కోల్పోని ధర్మరాజును తప్పకుండా భూషించవలసిందే. కాని భీముడు ధర్మరాజులా కాలేనందుకు నిందించ కూడదు. పురాణ కావ్యస్థాయిలో, మానవ ప్రమాణాల్నిబట్టి విలువ కట్టి నప్పుడు, దుర్యోధనుడిమీద అంత ఉదారంగా చూపిన సానుభూతిలో కొంతయినా మనం, భీముడిమీద — తప్పకుండా చూపించవచ్చు!

ఇవి నాటకంలో ప్రత్యక్షంగా ఉన్న ప్రధాన సమస్యలు; ఎప్పుడో గతించిన సంగతులు కావు. చావుదెబ్బ తినడానికి కొన్ని నిమిషాలముందు దుర్యోధనుడు భీముణ్ణి ఎలా ఎగతాళి చేస్తాడో చూడండి: "ఓరి షండా! ఆనాడు మేము కృష్ణ (ద్రౌపది)ను రచ్చకులాగి సభామందిరమంతటా తిప్పిననాడు ఏమయిందిరా నీ మగతనం?" భీముడి చేతిలో చావుదెబ్బ తినడానికి ఒక క్షణం ముందు, దుర్యోధనుడు విజయగర్వంతో తొడ చరవడం కూడా గుర్తుంచుకోవాలి. అతన్ని కొట్టవలసింది తొడమీదనని సూచిస్తాడు కృష్ణుడు (అతని ప్రవర్తన ఈ నాటకంలో ఏమంత ఉదాత్తంగా లేదు). కాని అది అనవసరమనిపిస్తుంది. నేరానికి తగ్గట్టే ఉంది శిక్ష. విజయగర్వంతో చరిచిన తొడనే, ద్రౌపదికి చూపించిన తొడనే భీముడు విరగ్గొట్టాడు.

పైవాదం ప్రకారం, భీముణ్ణి నైతికంగా ఆదర్శపురుషుడిగా గణించాలని కాదు. భీమ దుర్యోధను లిద్దరిలో మనం ఎవరిమీద సానుభూతి చూపించాలన్న ప్రశ్న వచ్చినప్పుడు భీముడే అందుకు ఎక్కువగా అర్హుడని అనిపిస్తుంది. మొదటి అంకంలో భీముడు ద్రౌపదికి ఒక వాగ్దానం చేస్తాడు; దాన్ని నిలబెట్టుకోడంతో నాటకం ముగుస్తుంది — లేదా ముగిసి ఉండవలసింది అనడం మంచిది భీముడి మూలంగానే ముగింపుదాకా నాటకం సాగుతుంది. భీముడికీ, దుర్యోధనుడికీ మధ్య సంతులనం ఉండి ఉంటే ఇది అంతకంటె స్పష్టంగా ఉండేది.

## అశ్వత్థామన్

1929 లో వ్రాసిన ఈ నాటకాన్ని, మైసూరులో ఉన్న మహారాజ కళాశాల తాలూకు కన్నడ సంఘంవాళ్లు అదే సంవత్సరంలో ప్రదర్శించడంతో గ్రీకు నాటకం మొట్టమొదటిసారిగా కన్నడ సాహిత్యంలోను, కన్నడ

రంగస్థలం మీదనుంచి దర్శనమిచ్చినట్లయింది. శ్రీ కంఠయ్యగారు కనక సోఫక్లిస్‌కు కృతజ్ఞతలు చెప్పకుండా ఉండిఉంటే, గ్రీకు నాటకంతో పరిచయంలేనివాళ్లు దీన్ని, భారతీయుడు వ్రాసిన భారతీయ నాటకంగానే స్వీకరించి ఉండేవారు. బహుశా, రచయితకు నాటక ప్రక్రియమీద విచిత్ర మైన దృష్టి ఉందని అనుకునేవారేమో వాళ్ళను బృందగానం గందరగోళ పరిచి ఉండేది. వృత్తినాటక రంగంమీద దీని ప్రత్యక్ష ప్రభావం ఏమీలేదు. విశ్వవిద్యాలయాలవాళ్ళలోనూ, విద్యావంతుల్లోనూ ఇది సంచలనం కలిగించింది. నిశిత విమర్శకు పురికొల్పింది. ఆ సందర్భంగా వచ్చిన వివాదాన్ని గురించి తరవాత ముచ్చటిస్తాను.

అనువాదం చేయడమే శ్రీకంఠయ్యగారి ఉద్దేశ్యమయి ఉన్నట్లయితే ఆయన బహుశా షేక్స్‌పియర్ నాటకం ఏదైనా అనువదించి ఉండేవారు. కాని ఆయన మరొక రచనవల్ల ప్రేరణ పొందినప్పటికీ, స్వతంత్ర నాటకమే వ్రాయదలచుకున్నారు. ఆ నాటకం ఎంత అందంగా రూపొందినప్పటికీ విజాతీయంగా ఉండగూడదనుకున్నారు. విశ్వజనీయమైన సాహిత్యాన్ని సృష్టించిన గ్రీకు నాటకకర్తల కంటె మిన్నగానే—షేక్స్‌పియర్ మాదిరిగా ఒక రకంగా గ్రీకులు మనకు సన్నిహితులని భావించారాయన. మూగజీవాలను నరికిన 'అయాస్'[1]ను ఎన్నుకున్నారు. ఈ ఘట్టం ఆయనకు, మహాభారత సౌప్తిక పర్వంలో పాంచాలుర్నీ ఉపపాండవుల్నీ ఊచకోత కోసిన సంఘటనను గుర్తుకు తెచ్చింది. రెండిటికీ కనిపించే పోలిక పైపైకి కనిపించేది మాత్రమే. కాని, సోఫక్లిస్ వ్రాసిన 'అయాస్' నమూనాలో నాటకం వ్రాయటానికి తగ్గ కథ సౌప్తిక పర్వంలో కనిపించిందాయనకు. ఈ విధంగా రెండు మూలాలనుంచి ప్రేరణ లభించింది.

గ్రీకు నాటకాన్ని ఆయన చాలాకాలం అధ్యయనం చేశారు. ఇప్పుడు ఈ నాటకం వ్రాయడానికి తయారీగా మహాభారతం అధ్యయనం చెయ్యడంలో నిమగ్నులయారు. ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక పర్వాలు శ్రీ కంఠయ్యగారికి చదివి వినిపించాననీ, అప్పుడాయన వివరంగా నోట్సు తీసుకున్నారనీ డా॥ డి. వి. గుండప్ప వ్రాశారు. మూలాలకు భిన్నంగా తాము చాలా మార్పులు చేయవలసి ఉంటుందని శ్రీకంఠయ్యగారు గ్రహించారు.

---

1 దీనికి 'అజాక్స్' అన్న రూపాంతరం కూడా ఉంది.

ఒక రకంగా చూస్తే ఈయన, 'అయాస్' నాటకాన్ని బాగా సన్నిహితంగా అనుసరించారని చెప్పాలి. రంగానికి రంగం చొప్పునే కాదు, సంభాషణకు సంభాషణ లెక్కగాకూడా అనుసరించారు. నాటకాన్ని వివిధ విభాగాలుగా వింగడించే 'కోరస్' కూడా రెండిటిలో ఒకదాన్నొకటి పోలి ఉంటుంది. కోరస్, మూడు ఐక్యాలు, పాత్రల సంఖ్య (నిజానికి, మన నాటకంలో ఒక పాత్ర తక్కువ ఉంది) అన్నవి గ్రీకు నాటక లక్షణాలు. ఇవన్నీ మన నాటకంలో ఉన్నాయి. వీటన్నిటినిబట్టి చూస్తే, 'అశ్వత్థామన్' ఇంచుమించుగా పలచటి ముసుగులో ఉన్న అనువాదమేనన్న అభిప్రాయం కలగవచ్చు.

కాని అటువంటి అభిప్రాయం నిజంకాదని చెప్పవలసి ఉంటుంది. మూలానికి భిన్నమైన అంశాలు—చాలా ముఖ్యమైనవికూడా—అనేకం ఉన్నాయి. స్వల్పమైన మార్పులు, చేర్పులవల్లకూడా నాటకం, 'అయాస్'కు భిన్నంగా రూపొందించవచ్చు. కథాసంగ్రహాలను ('అయాస్'లోను, సాప్తిక పర్వంలోను, 'అశ్వత్థామన్' లోను ఉన్నవాటిని) పోల్చి చూసినట్లయితే ఈ విషయం స్పష్టమవుతుంది.

గ్రీకు నాటకంలో, ఆషిలస్ కవచాన్ని ఒడిస్యూస్‌కు బహూకరించడం జరుగుతుంది. యోధుల హోదానుబట్టి చూస్తే, ఆషిలస్ తరవాత చెప్పుకోదగ్గవాడు అయాస్. కాని ఆ కవచాన్ని అయాస్‌కు బహూకరించలేదు. దీంతో అయాస్‌కు కోపం వస్తుంది. తనకు ఈ బహుమానం రాకుండాచేసిన సేనానాయకులందరినీ చంపడానికి నిశ్చయించుకుంటాడు. కాని ఎథీనీ దేవత శాపంవల్ల అతనికి పిచ్చెక్కుతుంది.పశువుల మందలను చూసి, వాటిని ఆర్గైవ్ సేనానాయకులనుకొని చంపేస్తాడు. భ్రాంతి తొలగిపోయిన తరవాత, తాను చేసిన పరువుతక్కువ పనికి, ఎథీనీ దేవతకు ఆగ్రహం కలిగించినందుకు చిన్నబుచ్చుకుంటాడు. నిజానికి, ఆ దేవత ఆగ్రహం ఒక్కరోజే ఉంటుంది. కల్చాస్ అనే జోస్యుడిద్వారా ఈ సంగతిద్వారా తెలిసిన ట్యూసర్ (అయాస్‌కు సవతి తమ్ముడు), తాను వచ్చేవరకు అయాస్‌ను జాగ్రత్తగా కాపాడుతూ ఉండవలసిందని టెక్‌మెసా (అయాస్ పెళ్ళిచేసుకోబోయే బానిసపిల్ల) కూ, సలామిస్ నావికులకూ కబురు చేస్తాడు. కాని అప్పటికే అయాస్, తన స్నేహితుల కన్నుకప్పి ఆత్మహత్య చేసుకుంటాడు.

అగమెమ్నాన్, మెనిలాస్ వంటి గ్రీకు సేనాధిపతుల దృష్టిలో, అయాస్ దేశ ద్రోహి కింద లెక్క. అతని కళేబరాన్ని కాకులకూ గద్దలకూ వెయ్యాలని వాదిస్తారు. కాని ట్యూసరు, ఉదారపురుషుడైన ఒడిస్యూస్, వాళ్ళ అభిప్రా యాన్ని కాదని, అమరవీరుడికి జరపవలసిన విధంగా అంత్యక్రియలు జరిపిస్తారు.

సాప్తిక పర్వంలో ఇది: కౌరవుల పక్షాన పోరాడిన మహాయోధుల్లో అశ్వత్థామ ఒకడు. మహారాజయిన దుర్యోధనుడు యుద్ధరంగంలో రక్తపు మడుగులో పడి ఉండడం గమనిస్తాడు. రాజు ఇంకా బతికే ఉన్నాడు. కాని నరుల రక్తమాంసాలతో పొట్టనింపుకొనే పిశాచాలు అప్పటికే అక్కడ తచ్చాడుతున్నాయి. అశ్వత్థామ బాగా చలించిపోయాడు. తన తండ్రిలాగే దుర్యోధనుడు కూడా అధర్మయుద్ధంలో చనిపోయాడు. అదేరోజున పాంచా లుల్ని అందరినీ సంహరిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. దుర్యోధనుడు అతన్ని సైన్యాధిపతిగా నియమించారు. అప్పుడు అశ్వత్థామ కృపాచార్యుణ్ణీ కృత వర్మనూ వెంటబెట్టుకొని ధృష్టద్యుమ్నుడి శిబిరానికి వెళ్ళాడు. పాంచాల, ఉపపాండవులతోసహా అందరినీ చంపాడు; వాళ్ళు నిరాయుధులై ఉన్నా రనికాని, గాఢమైన నిద్రలో ఉన్నారనికాని సంకోచించలేదు. ఈ సంగతి కృష్ణుడికీ, పాండవులకూ తెలిసి, అశ్వత్థామను పట్టుకోడానికి వెళ్ళారు. తరవాత జరిగిన యుద్ధంలో అశ్వత్థామ భయంకరమైన అస్త్రం ప్రయో గించాడు. కాని కృష్ణుడు దాన్ని వమ్ముచేసి అశ్వత్థామను శపించాడు మానవమాత్రుడెవరితోనూ మాటా పలుకూలేకుండా మూడువేల ఏళ్ళపాటు అడవుల్లోనూ ఎడారుల్లోనూ సంచరిస్తా వన్నాడు. అతని నుదుట వెలిగే మణిని ఊడబెరికి ద్రౌపదికి బహూకరించడం జరిగింది.

శ్రీకంఠయ్యగారి నాటకంలో వచ్చే పాత్రలు ఇవి (వీటికి పోలికగల గ్రీకు నాటక పాత్రల పేర్లు బ్రాకెట్లలో ఇవ్వడం జరిగింది); కథానాయకుడు 'అశ్వత్థామన్'[1] అన్న విషయం వేరే చెప్పక్కరలేదు; ఇతడూ ఇతని తండ్రీ, కర్నాటకంలో ఉన్న 'బనవాసి' నుంచి వచ్చినవాళ్ళు. కౌరవుల కొలువులో

---

1. ఈ నాటకంలో నాయకుడి పేరు శ్రీ కంఠయ్యగారు ఇలా వ్రాశారు: ‹అశ్వత్థామన్ (నకారాంతంగా). అదే వర్ణక్రమం ఇక్కడా ఉంచాను. నకారాంతం కాకుండా వ్రాసిన పేరు మహాభారత పాత్రది అని గమనించాలి.

కుదిరారు. ఏకలవ్యుడు (ట్యూసర్) కొందరు వేటగాళ్లుకూడా అశ్వత్థామన్ వెంబడి వచ్చారు. వాళ్లుకూడా బనవాసివాసులే. వాళ్ళు, సోఫక్లిస్ నాటకంలో సలామిస్ నావికుల మాదిరిగానే, ఈ నాటకంలో కోరస్‌గా వ్యవహరించారు. అశ్వత్థామన్ (మహాభారతంలోని అశ్వత్థామ బ్రహ్మచారి) కు ఒక కొడు కున్నాడు; అతని పేరు రుద్రశక్తి (యురిసెకస్). భార్య సంగతి చెప్ప లేదు. అశ్వత్థామ మామ్మ పేరు భార్గవి (టెక్‌మెసా). చిన్నప్పటినుంచి ఆవిడే అతన్ని పెంచిందట. ఈ నాటకంలో భీముడు, మెనిలాస్, అగమెమ్నాన్ లిద్దరి పాత్రలూ నిర్వహిస్తాడు. చివరికి కృష్ణుడు (ఒడిస్స్యూస్), రుద్రుడు (ఎథీనీ) పాత్రలు 'అయాస్' నాటకంలో సాటి అయిన పాత్రల లానే వ్యవహరిస్తాయి.

ఈ నాటకంలో ఘటనాక్రమం, 'అయాస్' నాటకంలో మాదిరిగానే ఉంది; దేవత ('అయాస్' లో ఎథీనీ, అందులో రుద్రుడు)ను లెక్కచెయ్యి కుండా అహంకరించి మానవేచ్ఛను అనుసరించడం, హంతకుడు ఉన్మాద స్థితిలో సంహారంచేసి, ఆ భ్రాంతి తొలగిపోగానే తాను చేసినదానికి పశ్చాత్తాప పడటం, ఆత్మహత్య, మృతవీరుడి అంత్యక్రియల గురించి వాగ్వాదం; మృత వీరుడి ఘనతను కీర్తించి గౌరవ సూచకంగా అంత్యక్రియలు జరపడంతో ముగింపు.

శ్రీకంఠయ్యగారు, ప్రధానమైన విషయాల్లో సోఫక్లిస్‌కు భిన్నంగా వెళ్ళారు. అయాస్ పోట్లాడింది తనవాళ్ళతోనే, తన సైన్యంలో ఉన్న నాయ కులతో; ఇతడు సైనికులందరి గౌరవానికీ పాత్రుడై ఆషిలస్ తరవాత అంతటి వాడని పేరు పొందినవాడు తన సహచరుల్నే తాను చంపదలిచాడు. పైగా మనం, ఇంకో విషయం గుర్తుంచుకోవాలి – ఆ సమయంలో గ్రీకు సైన్యం శత్రువుల భూభాగంలో ఉంది. అయాస్ వాళ్ళలోంచి వేరుపడి, తానను కున్న సేనానాయకుల్ని చంపి ఉన్నట్లయితే చాలా తీవ్రమైన పరిణామాలు వచ్చి ఉండేవి కాని అశ్వత్థామన్ చంపదలిచింది శత్రువుల్ని. తన రాజు వాళ్ళతో యుద్ధం చేశాడు. దాంతో, అతడు చేసిన నేరం సహజంగా తీవ్రమని పించదు.

రెండోభేదం మొదటిదానికి సన్నిహిత సంబంధమున్నదే; కాని ప్రేరణ మాత్రం వేరు. అయాస్ ప్రతీకారానికి మూలం ఆత్మప్రత్యయం. ఆషిలస్

కవచాన్ని ధరించే హక్కు తనకి ఉన్నప్పటికీ, దాన్ని పాటించకుండా ఒడిస్యూస్‌కు బహూకరించినందుకు అతనికి కోపం వచ్చింది. ఆర్గైవ్ సేనా పతుల - ముఖ్యంగా, ఒడిస్యూస్ - మరణం తనకి ఉపశమనం కలిగించి ఉండేది. ప్రాచీన గ్రీసులో అటువంటి బహుమానాలకు కొంత ప్రాముఖ్యం ఉండేదని ఒప్పుకున్నా, అయాస్ ఉద్దేశంలో అల్పత్వం ఉందని తెలుస్తుంది. దీన్ని శ్రీ కంఠయ్యగారు పరిహరించారు. అశ్వత్థామన్‌కు ఆగ్రహం కలగ డానికి కారణమైనవాటిలో మొదటిది, తన ప్రభువు యుద్ధరంగంలో దిక్కు మాలినవాడై రక్తపు మడుగులోపడి ఉండటం. అజేయుడైన తన తండ్రి ద్రోణుణ్ణి సైతం, దుర్యోధనుడిలాగే అధర్మంగా చంపారన్న సంగతి అతనికి గుర్తు వచ్చింది. కాని ఈ స్వవిషయం ఇక్కడ అప్రధానమైనది. ప్రధానంగా, రాజుపట్ల ఉన్న విధేయత, ప్రేమ అతన్ని కదిలించాయి. అయాస్ దృష్టిలో ఒడిస్యూస్, వ్యక్తిగత శత్రువు, గట్టి పోటీదారు. అశ్వ త్థామన్ దృష్టిలో కృష్ణుడు, జిత్తులమారి నక్క; కౌరవ వంశాన్ని నాశనం చేసిన మహాభారత యుద్ధాన్ని నడిపించినవాడు అతడు. శ్రీకంఠయ్యా గారిక్కడ, 'కపటనాటక సూత్రధారి'గా కృష్ణుడికున్న పేరును (దీనికి ఆధారం మహాభారతంలో కూడా ఉంది) ఉపయోగించుకున్నారు. కృష్ణుడి మీద అశ్వత్థామన్‌కున్న ద్వేషం, నిజంగా ఒకరకంగా నైతికమైనదే

నైతికంగా చూస్తే, మహాభారతంతో అశ్వత్థామ కన్న శ్రీకంఠయ్యా గారి అశ్వత్థామన్ అధికుడు (అలాగని, కళాత్మకంగా అధికుడే కానక్కర లేదు). ఈ నాటకంలో, ఉన్మాదస్థితిలో సంహారం చేస్తాడు; కాని మహా భారతంలో తాను చేస్తున్నది తెలిసి చేస్తాడు. పాంచాలుల్ని చంపడానికని బయలుదేరినవాడు ఉపపాండవుల్ని కూడా చంపేస్తాడు. కాని మన అశ్వ త్థామన్ అలా కాదు. తాను చేసింది ఉన్మాదస్థితిలోనే అయినా, చేసినదానికి సిగ్గుపడే సంస్కారముంది. మహాభారతంలో ఉన్నవాడు, తాను చెయ్య దలుచుకున్నదాన్ని గురించి ఆలోచిస్తాడు; అతని స్నేహితులిద్దరూ దాన్ని కాదన్నారు. అయినా అతడు అనుకున్నది చెయ్యడమేకాదు, చేసినందుకు గర్వించాడు కూడా.

గ్రీకు పురాణగాథలో ఉన్న పాత్రల స్థానంలో మహాభారత పాత్రల్ని చొప్పించేటప్పటికి నాటక వాతావరణమే మారిపోయింది. దీన్ని చాలా

సమర్థంగా నిర్వహించారు. అంతకంటె చెప్పుకోదగ్గ విశేషమేమిటంటే, నాటకంలో ముందు ముందుకు సాగినకొద్దీ నిర్వహణలో నైపుణ్యం, నైశిత్యం కవితాదృష్టి, నాటకీయత అక్కడక్కడ కొన్ని చక్కని చమక్కులు ప్రస్ఫుట మవుతూ ఉంటాయి. ఆయన కళానైపుణ్యానికి మంచి ఉదాహరణ, దాదాపు నాటకారంభంలోనే కనిపిస్తుంది. కృష్ణుడు అడుగుతాడు.

అతని (అశ్వత్థామన్) సంహారక హస్తాన్ని అప్పుడు నిరోధించిన దేమిటి?

రుద్రుడి సమాధానం ఇది :

విను, చెబుతా. సూర్యుడస్తమించాడు, అలాగే కౌరవనాథుడూ.

చాలాసేపు కూర్చున్నాడు అశ్వత్థామన్, తానెంతో ప్రేమించిన రాజు పక్కన, లోపల పెల్లుబుకుతున్న దుఃఖాన్ని అణచుకొనే ప్రయత్నం చేస్తూ.

రాజు కన్నులుమూసి, గౌరవపురస్సరంగా, తన శిబిరానికి సాగాడు, కోపంతో పళ్ళు పటపటలాడిస్తూ.

విల్లు విసిరిపారేశాడు, ఒరలోంచి దూశాడు రెండు వేపులా పదునున్న కత్తిని.

నడిరాత్రి చొచ్చుకు వచ్చాడు మీ శిబిరంలోకి. వస్తుంటే ప్రత్యక్ష మయాను నేను.

"ఎక్కడికి వీరయోధుడా?" అని అడిగాను. "ఏ యుద్ధానికి? ఏం వరం కావాలి నీకు?"

"నాశనం చెయ్యాలి నేను, పాండవ వంశాన్ని"

"కొందర్ని తప్పించి" అన్నాను నేను.

"చూడు, ఓ రుద్రా, దూరంనుంచి చూడు నన్ను, మనషి బలం ఎంతటిదో నువ్వేచూడు!" అంటూ పొగరుగా నవ్వాడు. నేనూ చిరునవ్వు నవ్వి, అతన్ని మాయకమ్మేటట్టు చేశాను.

మనసు మబ్బు కమ్మిందతనికి, కళ్ళకేమీ కనిపించలేదు. అతన్ని ఆకట్టి లాక్కుపోయాను, నీ శిబిరంనుంచి

బయటి శిబిరాల్లో ఉండేవాళ్ళదగ్గర విడిచి పెట్టాను.

ఇప్పుడు చూడు – అతని ప్రలాపాలు! అతని సంహారగరం!

పశువుల్ని పడగొట్టాడు, తరితరిమి నరికాడు ఆడవాళ్ళని
దాదులచేతుల్లో ఉన్నవాళ్ళని, పసిపాపల్ని – కత్తిమొనకు గుచ్చి
ముక్కలుగా తరిగాడు; శిబిరాలు నేలగూల్చాడు, కత్తితో కూల్చాడు
జనాన్ని.

ఇంకా నిద్రతో బరువెక్కిన కళ్లు నులుముకుంటూ ఉన్న వాళ్ళని.
నేను దగ్గరగానే ఉన్నానతనికి, పిచ్చినింకా రెచ్చగొడుతూ
తుపాను రేగిన కడలి కెరటాల మాదిరిగా

ఒక గుర్రాన్ని దొరకబుచ్చుకొని, దాని మెడ నరుకుతూ అరిచాడు,
"ఓరి, ధృష్టద్యుమ్నా, నువ్వు నీ గురువు గొంతుకోసింది ఇలాగే
కదూ? గొప్ప ఘనకార్యం చేశావు!"

ఏనుగు నొకదాన్ని బయటికి లాగాడు, భీముడనుకొని. "ఏదీ, కౌరవ
నాథుడి తలదన్నిన పాదం ఏదీ?" అంటూ అరిచాడు;

దాని కాలు నరికి, చంపి, అదేపనిగా దాని కళేబరాన్ని తన్నాడు.
తక్కిన వాళ్ళనందరినీ చంపేశాననుకుని, ఒక గొర్రెను చంకన
పెట్టుకొని,

పోతూ అరిచాడు, "ఒరే, జిత్తులమారి కొంకి నక్కా, యుద్ధం రగిలించి
మంటలురేపింది నువ్వు కాదురా! రారా కృష్ణా, నువ్వు విత్తువేసిన
చెట్టు పళ్లు రుచి చూద్దువుగాని రా! ప్రత్యేక గౌరవం పొందే అతిథివి
నువ్వు!"

శ్రీకంఠయ్యగారి నాటకం, సోఫక్లిస్ నాటకం కన్న 420 పంక్తులు తక్కువ. కాని ప్రత్యేకించి ఈ భాగం, అయాస్ అన్నదానికన్న 11 పంక్తులు ఎక్కువ. ఈ మార్పు పతాకస్థాయిని ఉద్దేశించి చేసి ఉండవచ్చు. అయాస్, "సేనాపతి ద్వారం దగ్గర నించున్నాడు". అశ్వత్థామన్, కౌరవనాథుని దేహం దగ్గర కూర్చున్నాడు; అతని ముఖం దుఃఖంతో మ్లానమయింది; చని పోయిన రాజు కళ్ళు మూసేస్తాడు. 'అయాస్' లో అస్పష్టమైన 'చీకటి' ఉంటే, ఇక్కడ పడమట సూర్యుడు అస్తమించడమూ కౌరవరాజు అస్త మించడమూ ఒక్కసారే జరుగుతాయి. ఇక్కడ దృశ్యమంతా సంకీర్ణంగా, స్పష్టంగా, వివరంగా ఉంది. అటు సూర్యాస్తమయం, ఇటు కౌరవాస్తమయం

ఒక్కసారే జరగడం, దుర్యోధనుడి ఘనతను పెంపొందిస్తుంది; అతని మరణం కౌరవ లోకానికి చీకటే అవుతుంది.

పైన ఉదాహరించిన పంక్తుల్లో వాలుడు టైపులో ఉన్న వాక్యాలు, కథనంలో నాటకీయకతను పెంచడమేకాక, అశ్వత్థామన్ పొగరుబోతుతనాన్ని స్పష్టం చేస్తాయి. అశ్వత్థామన్ పొగరుబోతు నవ్వుకీ, వ్యంగ్యంగా రుద్రుడు నవ్విన చిరునవ్వుకీ భేదం గమనిస్తాం—ఈ రెండు రకాల నవ్వులూ శ్రీకంఠయ్యగారు పెట్టినవే. ఇకపోతే, 'అయాస్' నాటకంలో, "ఈ సారి వీడు, ఈసారి ఆ సేనాపతి ..." అంటూ అస్పష్టంగా చెప్పడం జరిగింది. కాని శ్రీకంఠయ్యగారు ఇలా కాకుండా, నాటకంలో ఉన్న ధృష్టద్యుమ్న, భీమ పాత్రల్ని నిర్దిష్టంగా సూచించడం జరిగింది. వాళ్ళ పేర్లూ, ద్రోణ దుర్యోధనుల వధా సూచించడంవల్ల కావ్యపరిచయంగల పాఠకుల మనస్సుల్లో ఇతర దృశ్యాలుకూడా మెదులుతాయి. కన్నడ మూలంలో ఆ భాగం వ్రాసేటప్పుడు ఆయన చందస్సులో చూపిన మెలకువలూ, శైలిలో సారళ్యం, శైలిలో ఉన్న క్లుప్తత, శక్తి నేను చేసిన వచనువాదంలో చూపించడం ఎలాగా సాధ్యంకాదు. సోఫక్లిస్ నాటకంలో పెచ్చు పెరుగుతున్న అయాస్ గర్వాన్ని మొదట్లో ప్రస్తావించి, దానికి ఉదాహరణలు తరవాత ఎప్పుడో ట్యూసర్ చేత చెప్పించడం జరిగింది. ఎథీనీ దేవత విషయంలో ప్రత్యేకంగా అతడు ఏ నేరమూ చెయ్యకముందే ఆమె, "మాయాజాలంలో పడేసిందతన్ని." కాని అతడు,

> "పలాస్, తక్కిన వాటన్నిటి విషయంలో నీ ఇచ్ఛనే నడుపు.
> కాని ఒడిస్యూస్ నెవరూ కాపాడలేరు, ఈ వినాశంనుంచి."

అని చెప్పడానికి కొంచెంముందునుంచే మాయాజాలంలో చిక్కుకుని ఉన్నాడు. కాని కన్నడ నాటకంలో, రుద్రుడు ఇస్తానన్న వరాన్ని అశ్వత్థామన్ లెక్కచెయ్యడు (సోఫక్లిస్ నాటకంలో వరం ప్రస్తావన లేదు). పైపెచ్చు, మానవ (అంటే, తన) శౌర్యాన్ని తిలకించే అవకాశం రుద్రుడికి ఇస్తానంటాడు. "కొందర్ని తప్పించి" అన్న రుద్రుడి మాటల్ని పట్టించుకోడు. అప్పుడూ అతనికి పిచ్చెక్కడం. శ్రీ కంఠయ్యగారు చేసిన ఈ మార్పువల్ల అశ్వత్థామన్, రుద్రుడిపట్ల అపచారం చేయడం, దానికి ఫలితం అనుభవించడం అతిసన్నిహితంగా జరిగాయి. ఈ రెంటికీ అలవోకగా

ఉన్న సంబంధాన్ని ప్రస్ఫుటం చెయ్యడం జరిగింది. ఆయన తీసుకోదలిచిన రెండు మూలాల్లోనూ సాత్త్విక పర్వాన్ని ఎంచుకోడంలో ఇంకో లాభం కలిగింది. అశ్వత్థామన్‌కి ఆగ్రహం కలగడానికి కారణం దుర్యోధనుడి చావూ, తన తండ్రి మరణమూ మాత్రమే కాదు. ఒకానొక మహా సామ్రాజ్యం అంతరించడం—కొందరి దృష్టిలో, యావత్ప్రపంచమూ అంతరించడం—కూడా. ఇందుకు భిన్నంగా 'అయాస్' నాటకంలో ఉన్న కలహ కారణం—కవచ బహూకరణంవల్ల కలిగింది—చాలా బలహీనమైనది.

సోఫక్లిస్ నాటకంలో ఎథీనీ మొరటుగా ప్రవర్తించినట్టే చెప్పాలి. ఒడిస్యూస్‌మీద ఆమె చూపిన పక్షపాతాన్ని మనం ఉపేక్షించవచ్చు—ఆ మాటకువస్తే, గ్రీకు పురాణగాథలనిండా ఉన్న దేవుళ్ళూ, దేవతలూ పక్షపాతం కలవాళ్ళే. "పగవాణ్ని చూసి నవ్వే నవ్వు, ఇంకా మధురమైనది". అన్న భావన, ఒక దేవత అనవలసింది కాదు. భ్రమలోపడ్డ అయాస్‌ను చూపిస్తూ, "దేవతలు బలవంతులోయ్, ఒడిస్యూస్" అనడం, ఆత్మతృప్తితో అన్నా విజయగర్వంతో అన్నా, గౌరవప్రదంగా లేదు. అయితే, తరవాత అన్న మాటల్లో కొంచెం దయ కనిపిస్తుంది :

"ఈశ్వరేచ్ఛ ననుసరించి నడుచుకొనేవారు మరొకరెవరున్నారు,
సకాలంలో చర్య తీసుకొనేవారు మరొకరెవరున్నారు,
అయాస్‌ను మించి?"

మన నాటకంలో ఆత్మ సంతృప్తి దయా రెండూ ఉన్నాయి. "నవ్వే మధురమైనది. పగవాణ్ని చూసి నవ్వే నవ్వు ఇంకా మధురమైనది" అని రుద్రుడు అన్నదానికి కృష్ణుడు ఇచ్చిన సమాధానం, అతడు అలా ఉద్దేశించకపోయినా, దాదాపు మందలింపులా ఉంటుంది: "అలాటి సంతోషం నాకు కిట్టదు."

ఈ నాటకంలో రుద్రుడి పాత్ర, ఎథీనీ కన్న మెరుగేమీకాదు; ఏమైనా ఉంటే కొంచెం లొచ్చే అని చెప్పాలి. అశ్వత్థామన్ తన పాలబడ్డ వాళ్ళ దురదృష్టానికి ఆనందించినట్టే, తన పాలబడ్డ అశ్వత్థామన్ దురదృష్టానికి రుద్రుడూ ఆనందిస్తాడు.

టెక్‌మెసా, అయాస్‌తోబాటు అతని శిబిరంలో ఉండడంలో ఆశ్చర్యం లేదు. కాని కురుక్షేత్ర వాతావరణంలో అలాటి బానిసకన్నె ఉండడానికి

అవకాశం లేదు. అంచేత ఆస్థానంలో భార్గవి పాత్ర (అశ్వత్థామన్‌కు మామ్మ అవుతుంది) ను ప్రవేశపెట్టడం జరిగింది. ఈ విధంగా అయితే మహాభారత కథ అష్టే దెబ్బతినదు; టెక్‌మెసాలాగే ఈవిడకూడా చాలా బాధలు పడ్డదీ, దయనీయ స్థితిలో ఉన్నదీను. ట్యూసర్‌ను ఏకలవ్యుడిలా మార్చడంవల్ల ప్రత్యేకమైన ప్రయోజనం ఏమీ సిద్ధించలేదు ; కాని అశ్వత్థామన్‌కు ఒక సోదరుణ్ని సృష్టించవలసిన అవసరం మాత్రం తప్పింది. మహాభారతంలో, అతనికి సోదరుడే లేడు.

అయాస్ ఇతివృత్తానికి ఒక విషయంలో తీవ్రమైన ఆక్షేపణ వచ్చింది. అయాస్ మరణంతో నాటకం ముగిసిపోవద్దా? తరవాత ట్యూసర్ పలికిన పన్నెండు పంక్తులూ అనవసరం కాదా? చచ్చినవాడి శవాన్ని గురించి తర్జన భర్జనలు జరగడం పరాకాష్ఠను భగ్నం చెయ్యవా ?

సోఫక్లిస్ నాటకం వ్రాయడానికిముందే సాంప్రదాయిక గ్రీకు సాహిత్యంలో విషాదనాయకుడిగా సగంవరకు తయారైన అయాస్ ఉన్నాడు. అతడు పురాణగాథల్లో వచ్చే నాయకుడు; జ్యూస్ కన్న కుమారు డని చెబుతారు; బలంలోనూ శౌర్యంలోనూ ఇతడు ఆషిలస్‌కు తరవాత చెప్పుకోవలసినవాడు. ఎథీనియన్‌లలో ఇతని పేరిట ఒక వర్గం ఉంది; ఇతని గౌరవార్థం ఉత్సవాలు జరిగేవి; ఇతని ఘనతను సోఫక్లిస్ స్థిరపరిచాడని ఆ కాలపు ప్రేక్షకుల నమ్మకం. ఈ మహాయోధుడు చేసిన నేరం, మూగ జీవాల్ని చంపడం. తరవాత ఆత్మహత్య చేసుకుంటాడు. ఇందువల్ల అతన్ని ఆరాధించేవాళ్ళ దృష్టిలో, అతని మూర్తిమత్వం తగ్గుతుంది. ఇలా పతన మైనవాణ్ణి తిరిగి ఉన్నతస్థానంలో నిలబెట్టడం ఆషిలస్ ఆశయం. అటువం టప్పుడు, 'అయాస్' నాటకం పునరావాస కల్పన కథకింద లెక్కకు వస్తుంది. గ్రీకుల దృష్టిలో, వీరపూజకు కేంద్రస్థానం సమాధి. వీరుడికి ఉచితరీతిలో అంత్యక్రియలు జరిపి గౌరవించాలి. అంచేత సమాధి తతంగానికి ప్రాముఖ్యం వచ్చింది. ఈ సంప్రదాయంతో పరిచయంలేని వాళ్ళకి దీని ప్రాముఖ్యం తెలియదు. అయాస్‌లో ఆఖరి దృశ్యం రెండు ప్రయోజనాలు చేకూరుస్తుంది. ఆ వీరుడి ఘనతను ప్రేక్షకులకు గుర్తుచెయ్యడం ఒకటి, అతనికి తగిన విధంగా అంత్యక్రియలు జరిగేటట్టు చూడడం ఒకటి.

ఈ విధంగా సమర్థించగల అవకాశం ఉన్నప్పటికీ— ఇతివృత్తానికి సంబంధించినంతవరకు విమర్శకు ఇది సమాధానం ఇస్తుంది—నాటక

దృశ్యం బలహీనంగా ఉందనడంతో సందేహంలేదు. చనిపోయేముందు అయాస్ ప్రశాంతంగాను, ఆలోచనాత్మకంగాను కూడా పలికిన పలుకులు అతని స్వభావరామణీయకతకు తగ్గట్టుగా ఉన్నాయి. కాని ఇందుకు భిన్నంగా, అతని మరణం తరవాత జరిగిన వివాదం చాలా కటువుగా, దుస్సంహంగా ఉంది; ఉదాత్తంగా ఉందని చెప్పడానికి ఏమాత్రం ఆవకాశం లేదు. అంటే, నాటకాన్ని పొడిగించడంవల్ల కలిగిన లాభం, సౌందర్య భావనకూడా కొంత ఉన్నప్పటికీ, కేవలం సాంకేతిక ప్రయోజనం మట్టుకే అని చెప్పాలి.

అశ్వత్థామన్‌లోకూడా పొడిగింపు ఉంది. అశ్వత్థామన్‌కి ఒక గుడి కట్టించాలనడం, అతని గౌరవార్థం ఉత్సవం జరపాలనడంకూడా వచ్చాయి. ఇలాటి ఉత్సవం భారతీయ వాతావరణానికి సరిపడేదే. కాని మహాభారత వీరులందరిలోకీ అశ్వత్థామన్‌కే గుడి కట్టించాలనడం విడ్డూరంగా ఉంది. శవాన్ని గురించిన రభస ఈ నాటకంలోనూ ఉంది. ఇక్కడ భీముడు అవసరమయినంతగా తగ్గుస్థాయిలో వాదిస్తాడు. ఏకలవ్యుడు దానికి తగ్గట్టు జవాబు చెబుతాడు. ఈ దృశ్యం శ్రీకంఠయ్యగారికి కూడా తృప్తిగా ఉన్నట్టు లేదు. సోఫక్లిస్ నాటకంలో ఈ దృశ్యం (మెనిలాస్ ప్రవేశం మొదలుకొని) 372 పంక్తులు ఉంది; మొత్తం నాటకంలో నాలుగోవంతుకు మించి ఉంది. తర్జన భర్జనలకే 220 పంక్తులు పట్టాయి. 'అశ్వత్థామన్' నాటకంలో మొత్తం దృశ్యం 186 పంక్తుల్లో ముగిసింది. భీముడూ ఏకలవ్యుడూ వాదు లాడుకోడం 37 పంక్తులే. దూషణ వాక్యవిన్యాసాన్ని తగ్గించినందుకు, వాదోపవాదశక్తుల్ని కనీసపు మోతాదులోనే ఉంచినందుకు, యుద్ధాన్ని నిరసించి శాంతికి ప్రాముఖ్యమిచ్చినందుకు మనం సంతోషించాలి. మృత వీరుణ్ణి ప్రస్తుతించే పని పూర్తిగా కృష్ణుడికే అప్పగించడం జరిగింది.

పునరావాస కల్పన ఇందులో కూడా ఉంది కాని, బహుశా 'అయాస్' నాటకంలోకన్న ఆకర్షకంగా ఉండవచ్చు. ఇక్కడ పునః ప్రతిష్ఠించినది, అశ్వత్థామన్‌ని అనడం కంటె ధర్మాన్ని అనడం సబబు. ఇది, తీవ్రవాంఛ లనూ హింసాప్రవత్తినీ యుద్ధాన్నీ బృందగానం ద్వారా నిరసించిన తరవాత జరిగింది.

ఓ దుష్టయుద్ధమా, ఎప్పుడు నువ్వు నశింపయేది
ఓ శాంతిమాతా, ఎప్పుడు నువ్వు వర్ధిల్లేది!

"పాముకు కోరలు ఇచ్చిన పాపి - ఆ దురాత్ముడు యుద్ధబీజాలు నాటాడు" అన్నట్టుగా, ఆదినుంచి మహాభారత యుద్ధ పర్యంతం సంభవించిన పరిణామాల్ని కోరస్‌లో వివరించడం జరిగింది. (ఈ సందర్భంలో మరో విషయం గమనించవచ్చు. పాముకు కోరలు ఇవ్వడం అన్న అంశం గ్రీకు పురాణ గాథల్లో సుపరిచితమయినవి, భారతీయ వాతావరణానికి అది ఎబ్బెట్టుగా వినిపిస్తుంది).

కోరస్‌లో ద్రౌపది జన్మవృత్తాంతం వస్తుంది - ఆమె నిప్పులో పుట్టడం ఎంత సముచితంగా ఉంది! కొన్నేళ్ళ కిందట తన ఇంటికి అతిథిగా వచ్చిన దుర్యోధనుడు కాలు జారిపడినప్పుడు ఎగతాళిగా నవ్విందామె. తరవాత దుర్యోధనుడికి కూడా, కొప్పుపట్టి సభలోకి ఈడ్చించి తొడ చూపించిన సమయంలో, ఆమెను చూసి నవ్వే అవకాశం వచ్చింది; భీముడు విరగ గొట్టింది ఆ తొడనే; అంతే కాకుండా, ద్రౌపదికి తలవంపు తెచ్చినందుకు గాను దుర్యోధనుడి తల తన్నడం, అవమానపరచడం జరిగింది; అది అశ్వత్థామన్ ప్రతీకారానికి దారితీసింది! ఇలా ప్రతి నేరమూ మరో నేరానికి బీజం వేసింది.

ఈ విధంగా భయానక ఘట్టాల పరంపరను కోరస్‌లో సమీక్షించడమన్నది శ్రీకంఠయ్యగారి కల్పనే. తరవాత, బృందగాయకులు కృష్ణుడికి స్వాగతం పలికి, "శాంతిపాఠం నేర్పు మాకు, తండ్రీ" అని ప్రార్థిస్తారు. కృష్ణుడు చెయ్యబోయే ఉద్బోధకు ఈ బృందగానం ఒక భూమిక :

"నేనంటాను - రుద్రుడి సంకల్పం
గుండెను రాయి చేసుకోకండి మీరు
చనిపోయినవాడికి అంత్యక్రియలు మానకండి.
మీ ద్వేషం ఎంత గొప్పదయినా సరే
ధర్మాన్ని ద్వేషం మట్టుపెట్టగూడదు."

అశ్వత్థామన్ మీద పగదీర్చుకోకపోయినట్లయితే పాండవుల విజయానికి అర్థం లేదనిపించింది భీముడికి. కాని కృష్ణుడు ఇలా అంటాడు (అయాస్‌ను గురించి ఒడిస్యూస్ ఇలాగే పలుకుతాడు) :

"నీ మిత్రుడికి నువ్వు లొంగిపోవడం నీకు విజయం
క్షమించడం విజయం
ఆగ్రహావేశాల్ని నిగ్రహించుకోడం,
ధర్మానికి దృఢబద్ధుడై ఉండడం,
అదే విజయం."

ఈ విధంగా అశ్వత్థామన్ కంటె ధర్మప్రతిష్ఠాపనకే ప్రాముఖ్యం లభించింది. ఈ సందర్భంలోనే మరో సంగతి, పగవాణ్ణి చూసి నవ్వే నవ్వు ఇంకా మధురమైనదని అన్న రుద్రుణ్ణి కూడా పునఃప్రతిష్ఠించడం జరిగింది. అశ్వత్థామన్‌ను రుద్రుడే పరిత్యజించాడని భీముడు వాదించినప్పుడు కృష్ణు డంటాడు :

పరిత్యజించాడా ?
కాదు, తన ఒడిలోకి తీసుకున్నాడు
ఆయన సంకల్పరహస్యాలు తెలుసా మనకు ?
అతన్ని పునీతుణ్ణి చేశాడంటాను
అతని ఆత్మను తనలో కలుపుకొన్నాడంటాను.

ఈ నాటకంలో ఉన్న పాత్రల గురించి రెండు మాటలు చెప్పి ఈ పరిశీలను ముగించవచ్చు. అశ్వత్థామన్ గురించి ముందే కొంత చెప్పు కున్నాం. బలశౌర్యాల విషయంలో, గ్రీకు యోధుల్లో ఆషిలస్ తరవాత చెప్పుకోదగ్గవాడు అయాస్ అని కూడా చెప్పుకున్నాం. ఇద్దరినీ పోల్చి చూసి నట్టయితే అశ్వత్థామన్ హోదా అయాస్ హోదాకంటె తక్కువదే నన్నది స్పష్టమవుతుంది. మహాయోధులతోపాటు ఇతన్ని కూడా పేర్కొనడం జరిగింది. కాని వాళ్ళలో ఇతని స్థానం ఏమంత చెప్పుకోదగ్గది కాదు. యోధానయోధులు చనిపోయిన తరవాతే ఇతన్ని సైన్యాధిపతిని చెయ్యడం జరిగింది; దుర్యోధనుడు అవసానకాలంలో చూపిన ఔదార్యం ఇది. అయితే అశ్వత్థామకి సైన్యాధిపత్యం వచ్చిందే కాని, అతడు నడిపించడానికి సైన్య మేమీ మిగలలేదు. శ్రీకంఠయ్యగారు, అయాస్‌లో ఉన్న ఘనతను తెచ్చి అశ్వత్థామన్‌లో అంటుగట్టారు. ఇది బాగా ఫలించింది. అతనిలో రుద్రాంశ ఉందని మహాభారతంలో సూచించడం జరిగింది. శ్రీకంఠయ్యగారు దాన్ని

కూడా ఉపయోగించుకున్నారు. అశ్వత్థామన్‌ను 'రుద్రావతార'మని అనేక సార్లు పేర్కొనడం జరిగింది.

అశ్వత్థామన్‌కి, మహాభారతంలో ఉన్న తన పేరింటిగాడి దగ్గరి నుంచి, గ్రీకు నాటకంలో ఉన్న అయాన్ నుంచి అహంకారం చాలావరకు సంక్రమించింది. నైతికంగా ఇతడు, అయాస్‌కన్నా మహాభారతంలోని అశ్వత్థామకన్నా అధికుడే. ఎలాగంటే, అయాస్‌కున్న కారణం కన్న అశ్వత్థామన్ కారణం ఉదాత్తమైనది. పైగా మహాభారత పాత్రలా కాకుండా, పిచ్చిలో ఉన్నప్పుడే పాపాలు చేశాడు. సోఫక్లీస్ నాటకం పూర్వ భాగంలో అయాస్, మొరటు మనిషి; అశ్వత్థామన్ భార్గవితో మాట్లాడే టప్పుడు ఒక్కొక్కప్పుడు ఆ మొరటుతనం కొంత కనిపిస్తుంది ఆమె అతనికి మామ్మ అవుతుందన్న సంగతి గుర్తుంచుకోవాలి మనం. జీవితంలో చాలా కష్టాలు అనుభవించిందామె. తల్లిలేని బిడ్డ అయినప్పుడు తానే పెంచి పెద్ద చేసింది. ఇలాటిదాన్ని అతడు గౌరవంగా చూడాలని ఎవరైనా ఆశిస్తారు. అతడు ఆమెపట్ల ఎప్పుడూ అలా నిర్దయగానే ప్రవర్తిస్తాడని కాదు. ఒక సందర్భంలో - అతడు రుద్రశక్తిని ఆశీర్వదించేటప్పుడు-ఆమెవేపు చూపించి ఇలా అంటాడు : "మనకు ఇలవేల్పు ఈవిడ. ఈవిడ దృష్టిలో నువ్వు బంగారు తండ్రిలా బతకాలి." ఇది ఉత్తమ భారతీయ సంప్రదాయానికి అనుగుణంగా ఉంది. కాని ఇతర సందర్భాల్లో అతడు, చాలా పెడసరంగా, క్రూరంగా, దాదాపు అసహ్యించుకొంటూ మాట్లాడతాడు. "ఆడవాళ్ళు నోళ్లు మూసుకోడం మంచిది" అని అతని అభిప్రాయం. మరో సందర్భంలో ఆమెతో సూటిగా మాట్లాడడం జరగదు. ఆమె ఎదురుగా ఉండగా, "చెప్పి నట్టు విని నడుచుకుంటుందా ఈవిడ ?" అని కోరస్‌ను అడుగుతాడు.

విషాదభరితమైన అనుభవంవల్ల అశ్వత్థామన్ ఆత్మ పునీతమైందని కాని నైతిక పునరుజ్జీవనం జరిగిందని కాని చెప్పడానికి లేదు. ఇలా అన్నంత మాత్రాన, ఆ నాటకాన్ని ప్రతికూలంగా విమర్శిస్తున్నట్టు కాదు. నిజానికి, వేదనా నుభవంవల్ల ఆత్మపరిశుద్ధి కలిగిన పాత్రనే చిత్రించాల్సిన బాధ్యత శ్రీకంఠయ్య గారి మీద ఏమీలేదు. మూగజీవాల్ని, ఆడవాళ్ళని పసివాళ్ళని చంపినందుకు పడవలసిన అవమానం పడనే పడ్డాడు. తాను పాపినని ఒకటి రెండుసార్లు అనుకోడం కూడా జరిగింది. తాను చేసిందీ, చెయ్యవలిసిందీ ఎంత ఘోర

మైన నేరమన్నదానికన్న, తనను గురించి లోకం ఏమనుకుంటుందోనన్న శంకే అతన్ని ఎక్కువ బాధించింది. అతని కడపటి మాటల్లో కూడా పశ్చాత్తాపం లేదు. కోపాధిదేవతల ఆగ్రహానికి పాండవులందరూ గురికావాలనీ, వాళ్ళలో ఒక్కడూ చావు తప్పించుకోగూడదనీ కోరతాడు. తనను గురించి తాను వేసుకొన్న అంచనానుబట్టి, తానిప్పుడు మానవుల గౌరవాన్నీ దేవతల గౌరవాన్నీ కూడా కోల్పోయిన వాడినని భావిస్తాడు. తాను తిరిగి ఇప్పుడు బనవాసికి వెళ్ళినా, తన వాళ్ళ ఎదుట తల ఎత్తుకోలేడు. అంచేతనే చావు రావాలని కోరుకుంటాడు, అంతేకాని తన పాపానికి అది పరిహారంగా భావించడు. ఆ చావు కూడా యుద్ధంలో రాగూడదు; విజయం పొందామన్న సంతోషం తన శత్రువులకు కలగ కూడదు. స్వర్గంలో ఉన్న తన తండ్రి–ఆయనకు ఘనంగా జోహారు లర్పిస్తాడు కూడా – దృష్టిలోను, తన కొడుకు దృష్టిలోను స్మరణీయమైనదేదో తాను చెయ్యాలి. ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకుంటాడు.

ఈ సందర్భంలో ఒక వివాదాన్ని గురించి ముచ్చటించాలి. ఈ నాటకం ప్రదర్శించిన తరవాత నెలల తరబడిగా ఈ వివాదం నడిచింది. భారతీయ సంప్రదాయం ప్రకారం అశ్వత్థామన్ అమరుడంటారు, శ్రీకంఠయ్యగారి ప్రత్యర్థులు. అలాంటివాణ్ణి శ్రీకంఠయ్యగారు చంపేశారు. అది చాలదన్నట్టు, అతడిచేత ఆత్మహత్య చేయించారు. వాస్తవానికి, అశ్వత్థామన్‌కు అమరుడన్న పేరు రావడానికి ఆధారం ఒక్క శ్లోకమే; అది ఎవరు వ్రాశారో తెలియదు. అశ్వత్థామ అమరుడని సమర్థించగల ఆధారం మహాభారతంలో ఏదీ లేదు. ఒకవేళ అమరుడే అయి ఉంటే, అతని తండ్రి ద్రోణుడికి తెలిసే ఉండాలి కదా. కాని ధర్మరాజు, "అశ్వత్థామః హతః . ." అన్నప్పుడు ద్రోణుడు వెంటనే నమ్మేస్తాడే! ఏది ఏమైనా, నాటక రచనంలో స్వతంత్రమైన మార్పులు చెయ్యగూడనంత ఉదాత్తమైనదేమీ కాదు, మహాభారతంలోని అశ్వత్థామ పాత్రకున్న స్థాయి.

ఆత్మహత్యావిషయం తేలికగా తీసిపారెయ్యడానికి వీలులేదు. 'ఆత్మహత్య' అన్న పదానికి, వ్యుత్పత్తిలోలేని దురర్థం ఛాయగా వచ్చింది. ఒక మహత్తరమైన లక్ష్యం సాధించడానికి ఆత్మహత్య చేసుకోడం గొప్పదే. అటువంటి సందర్భాల్లో దాన్ని 'ఆత్మబలి' అంటాం. అలాటిదాన్ని భారతీయ

సంప్రదాయం హర్షిస్తుంది. కాని అశ్వత్థామన్ ఆత్మహత్యవల్ల సాధించిన మహత్తర ప్రయోజనమేమిటి, మహత్తర లక్ష్యమేమిటి ? లోకనింద చెవిని పడకుండా చేసుకున్నాడంటే, ఆ చావయినా, తాను చేసిన పాపానికి పరిహారంగా కోరుకునిఉంటే, అతని పాత్రకు ఉదాత్తత చేకూరిఉండేది. కాని అలాటి ఉద్దేశం అతనికి లేనట్టు నాటకంలో తెలుస్తూనే ఉంది. అతని ఆత్మహత్యకు మనం అభ్యంతరం చెప్పక్కర్లేదు; కాని అంతకన్న మంచి కారణంతో చేసుకునిఉంటే బాగుండిపోను అనుకుంటాం. కాని అలాంటి కోరిక కళాసంబంధమైన హేతువులమీదకాక, నైతికమైన హేతువుమీద ఆధారపడి ఉంటుంది.

చివరివరకుకూడా అశ్వత్థామన్, సరయిన దృక్పథం అలవరచుకోడు. కృష్ణుడిగురించి అతడు వేసుకొన్న అంచనా పూర్తిగా పొరపాటు. అతన్ని మనం హర్షించినా హర్షించకపోయినా, విషాదనాయకుడి స్థాయికి పెరిగాడన్నది మాత్రం నిశ్చయం. మన గౌరవం, సానుభూతికూడా అందుకొంటాడు. అతని బలశౌర్యాలకు అతని స్థాయికి మిత్రులూ శత్రువులూ కూడా జోహారులర్పించారు. అపచారం పొందిన రుద్రుడే అతన్ని ఇలా ప్రశంసిస్తాడు: జ్ఞానంలోనూ శౌర్యంలోనూ అలాటివాడు మరొకడున్నాడా? దానికి, అశ్వత్థామన్ శత్రువయిన కృష్ణుడంటాడు: "నేనైతే ఎవరినీ ఎరగను." అతని ఘనత నాటకమంతటా స్ఫురిస్తుంది. అతని పొగరు కూడా అతని ఘనతను చాటుతుంది—అతనిలా, రుద్రుడితో దాదాపు సమాన హోదాలో మాట్లాడాలంటే, దాదాపు మానవాతీత స్థాయిగల మానవుడే అయివుండాలి. తన కొడుకు విలువిద్యలో నేర్పు చూపిస్తున్నప్పుడు గర్వంగా చిరునవ్వు చిందిస్తూ చూస్తున్న తండ్రిని గమనించినప్పుడు, మనం అతనిలో ఉన్న విషాదనాయకుణ్ణి మరిచిపోతాం. పుత్రవాత్సల్యంగల తండ్రే మన కళ్ళకు కడతాడు. అలాటివాడు, పిచ్చెత్తితేతప్ప పసిపిల్లల్ని పొట్టనపెట్టుకోడని ఒప్పుకుంటాం. పాండవుల్ని నాశనం చెయ్యడానికి కోపాధి దేవతల్ని ప్రార్థిస్తూ పలికిన మాటలు మన హృదయాల్ని కదిలిస్తాయి. తన శరీరం మొదట తన మిత్రులకే కంటబడాలని రుద్రుణ్ణి ప్రార్థించడంలోకూడా గర్వంతో కూడిన హుందాతనం ఉంది. వెలుగంటే అతనికున్న ప్రేమకు అతన్ని అభిమానిస్తాం. సూర్యభగవానుడికి అతడు చేసిన ప్రార్థనలో చక్కటి కవిత్వం ఉంది; కర్నాటక దేశాన్ని గురించి చెప్పిన సందర్భంలో

ఇంకా మంచి కవిత్వం ఉంది. అతను పలికిన ప్రతి అక్షరంలో మాతృ దేశభక్తి ద్యోతకమవుతుంది. అవసానకాలంలో అతనికి, తాటితోపుల నీడలు పరుచుకున్న కర్నాటక తీరాలు, అక్కడి సరోవరాలు, వాగులు, పచ్చటి పంటచేలు—అన్నీ ఒక్కసారి మనస్సులో ముసురుతాయి. ఒకరకమైన దైన్య స్పర్శ ఏర్పడుతున్నట్టు అనిపించినప్పటికీ, అతడు దాన్ని అణగార్చి ప్రాణం విడుస్తాడు; తనకంటె ముందు మృతులైన ద్రోణకర్ణాదుల్ని కలుసుకోవాలని ఆశిస్తాడు.

'దెబ్బకు దెబ్బ' అనే తత్వంగల సంస్కారరహితుల మోస్తరుగా మొరటుతనం రూపుకట్టిన పాత్ర భీముడు. భార్గవి గురించి అయితే వెనకే ఒకసారి చెప్పుకొన్నాం, మహాభారతంలో ఉన్న కృష్ణుణ్ని భగవంతుడి అవతారంగా అంగీకరించనూవచ్చు, అంగీకరించకపోనూవచ్చు. కాని అతని స్థాయి దివ్యత్వానికి చేరువలో ఉన్నదనడంలో విప్రతిపత్తి లేదు. కాని శ్రీకంఠయ్యగారు ఈ నాటకంలో, శ్రీకృష్ణుడు మానవమాత్రుడిగా తప్ప అంతకుమించి కనిపించకుండా ఉండడానికి ప్రత్యేకంగా శ్రమ తీసుకున్నట్టుంది. కాని చిక్కు ఎక్కడంటే, కృష్ణుణ్ని భగవంతుడి అవతారంగా భావించే మతం ఈనాటికీ దేశంలో వ్యాపించి ఉంది. ప్రాచీన గ్రీకుల మతం ఇలా లేదు. అందుచేత, కృష్ణుడు అవతారపురుషుడని విశ్వసించని వాళ్ళం కూడా, అతన్ని కేవలం మానవమాత్రుడిగా చిత్రించినందుకు ఆశ్చర్యపోతాం; అనంగీకారం తెలుపుతాం. శ్రీకంఠయ్యగారు అతనికి మరో పేరు ఏదైనా పెట్టి ఉంటే బాగుండుననిపిస్తుంది. కాని శ్రీకంఠయ్యగారి దృష్టితో మనం ఏకీభవించినట్లయితే ఆ పాత్ర మన ఆదర గౌరవాల్ని అందుకుంటుంది. నిజానికి, దివ్యుడిగా గుర్తింపు పొందిన రుద్రుడికన్న కృష్ణుడిలోనే దివ్యత్వం ఎక్కువ ఉంది. "పగవాణ్ణి చూసి నవ్వే నవ్వు మధురమైనది" రుద్రుడికి. కాని కృష్ణుడికి, "అలాంటి సంతోషం కిట్టదు" అశ్వత్థామన్‌మీద అతనికి ద్వేషం లేదు. రోజంతా అశ్వత్థామన్‌ని కనిపెట్టుకొని ఉండవలసిందిగా ఏకలవ్యుడికి కబురంపినవాడు అతడు. దయలేని లోకంలో మానవుడి దురవస్థ ఎంత దయనీయంగా ఉంటుందో మనస్సు కరిగేలా చెప్పాడు:

ఏమిటి ఈ జీవితం, మానవుడి జీవితం!
ఒక గాలి తెర

ఈ క్షణం ఒక నిడ
మరుసటి క్షణం అదీ లేదు.

ఇతని ఊహాలో, అశ్వత్థామన్ వేదన విశ్వజనీనమవుతుంది. "ఇప్పుడు ఇతడు బాధపడుతుంటే చూస్తున్నాను, రేపు అది నా వంతు కావచ్చు!" విజయాన్ని గురించి ఇతడు ప్రవచించినది ఉపషద్వాక్యంలా వినిపిస్తుంది:

క్షమించడం విజయం
కోపావేశాన్ని నిగ్రహించడం,
ధర్మానికి గట్టిగా కట్టుబడి ఉండడం
అదీ విజయం.

చందోనైపుణ్యం దృష్ట్యా, శైలిదృష్ట్యా 'అశ్వత్థామన్' గొప్ప విజయం సాధించింది. శ్రీకంఠయ్యగారు కావాలనే పాతకన్నడం వాడారు. కథా వస్తువుకు ఇది అనువుగా ఉండడమేకాక 'మానసికమైన దూరాన్ని' సమర్థంగా ప్రదర్శించింది. ఆధునిక కన్నడంలోనే వ్రాసి ఉండవలసిందని కొందరు వాదించారు. బహుశా అదే బాగుండేది. కాని, ఒకవిధమైన అందం చూపించదలిచి సాధించిన తరవాత, మరొకవిధంగా ఎందుకు ప్రయత్నించ లేదని వాదించడం దేనికి? ఈ విషయంలో అభిప్రాయాలు వేరుకావచ్చు; కాని ఈ నాటకంలోని గీతరామణీయకత విషయంలో మాత్రం అభిప్రాయ భేదాలకు తావులేదు. శ్రీకంఠయ్యగారి గీతరచనాశక్తికి ప్రకృష్టమైన ఉదాహరణలుగా ఆయన గీతాల్లోంచి ఏవైనా ఎంపిక చేసుకోవలసివస్తే, బహుశా మనం, బసవాసి సౌందర్యాన్ని కీర్తించే బృందగీతాన్ని (పంక్తులు 488 నుంచి), 'ఆనందమా, అపరిమితానందమా' అన్న పంక్తితో మొదలయ్యే గీతాన్నే (పంక్తులు 545 నుంచి) ఎన్నుకుంటామనుకుంటాను. అంతేకాకుండా ఈ రెండోగీతంలో ఒక విశేషం ఉంది. ఇది అవడం సంతోషకరమైన గీతమే అయినా ఇందులో గంభీరమైన నాటకీయవ్యంగ్యం ఉంది—అశ్వత్థామన్ జీవించి ఉండడానికి నిశ్చయించుకొన్నాడన్న భావనతో వెలువరించినపాటే అయినా, వాస్తవానికి, అతడు చావుకు చేరువవుతున్నాడు.

కన్నడ సాహిత్య చరిత్రలో అశ్వత్థామన్‌కు గౌరవపూర్వకమైన స్థానం ఉంది. భారతీయ సంస్కృతినీ పాశ్చాత్య సంస్కృతినీ సమన్వయం చేసి రెంటికీ మేలు చేకూర్చాలన్నది శ్రీకంఠయ్యగారి గాఢమైన అభిలాష.

ఈ రెండు సంస్కృతుల్నీ ఈ నాటకంలో ఆయన కళాత్మకంగా మేళవించారు. తక్కిన రచనల్లో ఏ ఒక్కదాంట్లోనూ ఇంతగా సాధ్యం కాలేదు.

# 4

# పారశీకరు, హొంగన సుగళు, ఇతర లఘురచనలు

## పారశీకరు (ది పెర్సే)

ఆషిలస్ వ్రాసిన 'ది పెర్సే' రచనకు కన్నడ భాషాంతరీకరణం 1935లో వెలువడింది. ఇందులో చివరిలో, ధర్మాచరణ ఒక్కటే పారశీక సామ్రాజ్యాన్ని రక్షించగలదన్న ఉద్బోధకోసం శ్రీకంఠయ్యగారు చేర్చిన భాగం తప్పిస్తే, మూలానికి భిన్నంగా సాగినది దాదాపు లేదనే చెప్పాలి. అనువాదం అద్భుతంగా ఉంది; కాని ఆషిలస్ నాటకమే బలహీనమైనది. మొదటినుంచి చివరిదాకా ఒకటే విషాదం. అందువల్ల సహజంగా, కన్నడ అనువాదంలో మూలంలో ఉన్న బలహీనతే ప్రతిఫలిస్తుంది. శ్రీకంఠయ్యగారు ఒకసారి స్వయంగా చెప్పారు; పారశీకులమీద గ్రీకులు విజయం సాధించిన వృత్తాంతాన్ని ప్రదర్శించే నాటకం తమను ఆకర్షించడానికి ప్రధాన కారణం; నిజానికది విజయగీతం కాకపోవడమే. విజయాన్ని పరాజితుల దృక్కోణంలోంచి చూస్తుందది.

## హొంగన సుగళు (బంగారు కలలు)

వివిధ సందర్భాల్లో వ్రాసిన పద్యాల సంకలనం ఇది. భారతదేశాన్ని గురించి ముఖ్యంగా కర్నాటకం గురించి, తమను ప్రభావితుల్ని చేసిన ఆదర్శాలగురించి, సమైక్య కర్నాటకమంతనూ ఏదో ఒకనాటికి తన ఏల్బడిలోకి తెచ్చుకుంటుందని ఆశించిన మైసూరు రాజవంశంపట్ల తమకు

గల భక్తిని గురించి సుమారు ముప్పై సంవత్సరాల కాలంలో ఆయనకు కలిగిన ఆలోచనలకు అక్షరరూపం ఇది. ఛందస్సు, శైలి, ఆలోచనలు, దృక్పథాలు – అన్నీ మౌలికమైనవే నన్న విషయం స్పష్టం. ఈ సంపుటిలో మొదటి ఖండిక – బహుశా ఈయన కవితల్లోనే మొదటిది కావచ్చు. ఇది అన్ని విషయాల్లోనూ ఆధునికమే అయినా ఆదిప్రాసను మాత్రం పాటించడం జరిగింది. రానురాను ఈ ఆదిప్రాసకు ఆదరం తగ్గింది. ఈ సంపుటిలో ఉన్న ఖడికల్లో చివరినుంచి మూడోది 'ధర్మయుద్ధం'. శ్రీకంఠయ్యగారు దీన్ని ప్రాచీనకాలం నుంచి ఆదరం పొందుతూ వచ్చిన షట్పది (ఆరుపాదాల పద్యం) లో వ్రాయడమే కాకుండా 'ఆదిప్రాస' ను పూర్తిగా పాటించారు. ఇది 1943లో వ్రాసినది. ఆయన ఇలా వ్రాయడానికి కారణం బహుశా, తాము స్వేచ్ఛాప్రియులే అయినప్పటికీ సంప్రదాయానికి విరోధులం కామని విమర్శకులకు తెలియజెయ్యడ మేమో అనిపిస్తుంది.

భారతమాతా, ఓ భారతమాతా
మళ్ళీ నేను తల ఎత్తుకొనేటట్టు ఎప్పుడు చేస్తావు నువ్వు ?

ఈ సంపుటిలో మొదటి ఖండిక ఇలా మొదలవుతుంది. భారతదేశం ఎన్నడయినా తనలో ఉన్న కల్మషాన్ని వదుల్చుకుంటుందా? భారత దేశంలో ఉన్న చిత్రమైన వైరుధ్యాన్ని గమనిస్తా రాయన.

పొగమంచును చెదరగొట్టినవాళ్ళే,
వెలుతురు పారించినవాళ్ళే,
మనలోని జబ్బును నయం చేసినవాళ్ళే
కొత్త జీవితం ప్రసాదించినవాళ్ళే

వాళ్ళు సైతం, మన కళ్ళకు మబ్బులు కమ్మేటట్టు చేశారు; మన మెడలు విరిచారు. మనల్ని నాశనం చేశారు. మన సంస్కృతి ఘనతే మనకు మోయరానిభారమై కొత్త వెలుతురు ప్రసరించకుండాను, కొత్త జీవితం ఏర్పడకుండాను చేసిందన్న యథార్థం శ్రీకంఠయ్యగారి మనస్సులో ఉన్నట్లు అనిపిస్తుంది.

సత్యం మీ ఆత్మల్ని ఉత్తేజితం చేసినప్పుడు
సరిహద్దుల్ని వెనక్కి నెట్టలేకపోయారు
వెలుగు పారినచోట్ల నుంచి వెనుదిరిగి వెళ్ళిపోయారు

గుహల్లో ఇతికారు, అహంకారం పెంచుకొని
కులదురహంకారంతో, సంకుచిత విశ్వాసాలతో

ఇదీ భారతమాత తన సంతానంమీద వేసిన నింద. భారతదేశం మీద జరిగిన దాడులన్నీ, శ్రీకంఠయ్యగారి దృష్టిలో, భారతమాత తన బిడ్డల్లో జడత్వాన్ని వదిలించడానికి చేసిన ప్రయత్నాలు. ఆ మాతృమూర్తి ఇలా అంటుంది:

నా ప్రియసోదరినుంచి, బ్రిటానియానుంచి,
సాగర సామ్రాజ్ఞినుంచి సహాయం కోరాను.
భూతలాన్ని ఏకం చేసిందామె,
ప్రేమపాశాలతో బంధించిందామె
మన విశ్వాసాలన్నిటిలో ఉత్తమమైనదాన్ని పోషించింది.

ఈ చక్కటి కావ్యఖండిక శ్రీకంఠయ్యగారి విలక్షణతకు ప్రతీకగా కనిపిస్తుంది; ఇంగ్లండ్‌కూ భారతదేశానికీ మధ్య ఉన్న బాంధవ్యాన్ని గురించి ఆయనకుగల దృక్పథాన్ని మనకు స్పష్టం చేస్తుంది. బ్రిటిష్‌వాళ్లు మనల్ని "ప్రేమపాశాలతో బంధిం"చారన్నది నిజమేనా అనిపిస్తుందీనాడు మనకు; నిజానికి వాళ్లు చేసింది దానికి వ్యతిరేకం. వాళ్లు అనుకున్నదానికంటె, వాళ్ళకు తెలిసిన దానికంటె బాగా చేశారన్నది నిజం. కాని మనం రెండు విషయాలు ఒప్పుకోవలసి ఉంది. బ్రిటిష్‌పాలన భారతదేశానికి కొన్ని మేళ్లు చేసిందన్నది ఖాయం; శ్రీకంఠయ్యగారు ఈ విషయంలో చిత్తశుద్ధి కనబరిచారు; భారతదేశానికి ఇంగ్లండుకూ కూడా న్యాయం చేశామని విశ్వసించారు.

మైసూరు రాజకుటుంబాన్ని గురించి వ్రాసిన నాలుగు పద్యాల్లోకీ, 'కృష్ణరాజ రజత మహోత్సవ ప్రగాథ' అన్నది ఉత్తమమైనది. ఇంగ్లీషులో ఉన్న 'ఓడ్' అనే కావ్య ప్రక్రియను కన్నడంలోకి మొట్టమొదటిసారిగా ప్రవేశపెట్టిన కవిత ఇది. ప్రత్యేకంగా ఉత్సవ సందర్భాలకోసం వ్రాసే కవితల్లో ఆత్మీయత తెచ్చిపెట్టుకున్నట్లు సాధారణంగా అనుకుంటాం. కాని మొత్తంమీద శ్రీకంఠయ్యగారు, ఈ మాదిరి రచనలకు ఉండే ప్రతిబంధకాలన్నిటినీ అధిగమించారని చెప్పక తప్పదు. ఛందస్సు అద్భుతంగా నడిచింది; లయ అలవోకగా సాగింది; భావశబలత, ఉదాత్తత చేకూరాయి. ఈ

రజతోత్సవ సందర్భంగా ప్రకృతి చేసుకొన్న అలంకారాల్లో, "అలలు చుంబించే పడమటి సముద్రతీరాలు", "కొండలనుండి వడివడిగా పారే వాగులు", "పాలు పారే ఏరులు", జీవన ప్రవాతలయిన నీళ్ళను తెచ్చే కాలవలు, పచ్చటి పంటపొలాల సంపత్తి—అవుపిస్తాయి. ప్రజాతంత్ర పాలన వాదాన్ని గట్టిగా సమర్థించే ఈనాటి పాఠకుడు, కృష్ణరాజు నిజంగా గొప్ప వాడన్నమాట గుర్తుచేసుకోవాలి. ఆయన జ్ఞాని, సహనశీలి, కళనూ సాహిత్యాన్నీ పోషించినవాడు. ప్రగతి శీలంతోబాటు ప్రాచీన భారతీయ సంస్కృతిలో ఉత్తమమైన దాన్ని పరిరక్షించడానికి ప్రయత్నించినందువల్ల మితవాదిగా పేరుపొంది ఉండవచ్చు. మంత్రులను ఎంపిక చేయడంలోను, ప్రజాభిప్రాయానికి బానిసకాకపోయినా, దాన్ని గ్రహించడంలోను తెలివిగా వ్యవహరించేవాడు. శ్రీకంఠయ్యగారికి ఉన్న రాజభక్తి మనకు లేకపోవచ్చు; కాని ఆయన పనికిమాలినవాడిపట్ల చూపించలేదని ఒప్పుకోవాలి.

'బన్‌కొండ కృష్ణన్' అన్న స్మృతిగీతం కృష్ణరాజు చనిపోయినప్పుడు వ్రాసింది. కన్నడ కవిత్వంలో అంతకు పూర్వం, స్మృతిస్వరం ఛాయలు కనిపించినప్పటికీ స్వతంత్ర కావ్య ప్రక్రియగా రూపొందడం కొత్త. ఇంగ్లీషులో ఈ మాదిరి కవితల్లో పరిచితమైన లక్షణాలన్నీ దీంట్లో ఉన్నాయి. విద్యాధి దేవతకు విన్నపం, మనుషుల్లోనూ ప్రకృతిలోను కనిపించే సంతాపం, భావ వృత్తి మారడం, చనిపోయినవాడు నిజానికి చావలేదనడం, చివరికి ఓదార్పు—ఇవన్నీ ఉన్నాయి. కృష్ణరాజు గొప్పవాడన్న యథార్థాన్ని అంగీకరించినప్పటికీ కేవలం కవితాదృష్టితో చూస్తే, అందులో చూపిన ఛందోనైపుణ్యం, శైలీసంపత్తి, భావావేశ ప్రకటన విషయగౌరవాన్ని మించి ఉన్నాయనిపిస్తుంది.

'కన్నడ తాయ నోటు' అన్న కవిత, విజయనగర సామ్రాజ్యం తాలూకు ఆరో శతవార్షికోత్సవ సందర్భంగా వ్రాసింది. దేశభక్తి కవిత అలంకారిక శైలిలోకి చాలా సులువుగా దిగజారిపోతుంది. కాని శ్రీకంఠయ్య గారు, ఈరకం కవితలకున్న పరిమితుల్ని అధిగమించి రమ్యమైన కవిత వ్రాశారు.

కర్ణాటకమంతా చుట్టివచ్చాను నేను
దేశవైభవాన్నంతనీ ఆకళించుకొన్నాను,

పవిత్ర తీర్థయాత్రగా పర్యటన కావించాను,
ఆమె పాదధూళిని శిరస్సుతో తాకుతూ.
ఈ దేశం అందం ఏమని చెప్పను?
ఈ బంగారు భూమి, మనకు ప్రియమైన భూమి
ప్రియాతిప్రియమైన భూమి.
దీన్ని చుట్టివచ్చాను, దీని అందానికి సొక్కిపోయాను
నేను నా వశం తప్పిపోయాను
నా గుండె పాటతో నిండి
ఆనందంతో నాట్యం చేశాను.

ఈయన వ్రాసింది, ఎవరైనా అక్షరాలా నిజమని నమ్మవచ్చు. ఆయన నాట్యం చేశారో లేదో కాని, పాట పాడారన్నది మట్టుకు నిజం. తరవాత ఆయన, కర్నాటక శబ్దంలో ఉన్న చమత్కారంతో వినోదించారు— ఈ మాటకు 'నల్లని నేల' అన్న అర్థం తరచు చెబుతూ ఉంటారు. దేశంలో చాలా భాగం నల్లరేగడినేల కావడంవల్ల అలా అనడం సహజం. "కింద పొలాలు నల్లటివి, పైన మబ్బులుకూడా (వానాకాలం కారుమబ్బుల్ని ఊహించారు) నల్లటివే." తరవాత, కన్నెపిల్లల వంకుల జుట్టు నలుపు, నవ్వేవాళ్ళ కళ్ళు నలుపు. ఇందుకు భిన్నంగా తెల్లవి నురుగులు కక్కే జలపాతాలున్నాయి, సముద్రతరంగాలున్నాయి. ఈ పరిశీలన తరవాత, కన్నడ మాత దుఃస్థితిని వివరించడం జరిగింది. చివరికి, "భారతమాత పెద్ద కూతురు" మళ్ళీ వైభవోపేత అయి విజయలాంఛనంతో ఊరేగడంతో కవిత ముగుస్తుంది.

కర్నాటక మాతృశ్రీ కన్నబిడ్డలందరూ, ఆడవాళ్ళూ మగవాళ్ళూ కూడా, కన్నడ భాషాపతాకాన్ని నిటారుగా నిలపాలన్న ఉద్బోధ 'కన్నడద బావుటా' (కన్నడ జెండా) అన్న కవితలో ఉంది. కన్నడభాష తన ఉనికికొక గుర్తింపు పొందడానికి ఘర్షణ పడుతున్న సమయంలో కన్నడిగులకు శక్తినీ, ఉత్సాహాన్నీ ఇచ్చి కార్యశీలతకు పురిగొల్పినది ఇదే. కాని ఈ ఖండికలో కవిత్వంకన్న అలంకారం పెత్తనం చేసిందని చెప్పడంలో అన్యాయం లేదు.

ఈ సంకలనంలోకల్లా అద్భుతమైన కాణిక అని చెప్పదగినది 'శుక్రగీతె'. మైసూరు విశ్వవిద్యాలయం రజతోత్సవ సందర్భంగా వ్రాసినదిది. ఇక్కడ మనకు సంకుచితమైన రాజభక్తిలేదు, రాజకీయ విశ్వాసం ముడిపడ లేదు. ఇందులో ఆయన, ఉజ్జ్వలమైన కర్నాటక దేశాభిమానానికికూడా అతీతులయారు. జ్ఞానం, సత్యం అన్నవాటితోనే ఇక్కడ ప్రమేయం. విద్యకూ అవిద్యకూ సత్యానికీ, అసత్యానికీ, దేవతలకూ రాక్షసులకూ ఎప్పటికీ జరిగే సంఘర్షణతోనే ప్రమేయం ఉంది. సనాతనకాలంనుంచి గురు శిష్యులమధ్య సౌమనస్యంకోసం పలికే శాంతిపాఠంతోనే మొదలవుతుంది.

ఓం సహనావవతు
సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు, మా విద్విషావహై.

దాని తరవాత :

"వెలుతురు వచ్చుగాక," అని సృష్ట్యాదిలో
అన్నప్పుడు, వెలుతురు ప్రసరించింది,
ఆ వెలుతురు ఇంపుగా ఉంది.
ఆ వెలుతురునుంచి దూసుకువచ్చాయి మెరుపులు,
అప్పుడు ప్రకాశించాయి ఖగోళాలు –
సూర్యుడూ చంద్రుడూ లోకానికి రెండు కళ్ళు
సత్యమూ ధర్మమూ మాదిరిగా
క్షమా దయా మాదిరిగా

అప్పుడు భూదేవి, పచ్చని వలువలతో అందగించి గానంచేస్తూ సాక్షాత్కరించింది. ప్రత్యగాత్మ విశ్వాత్మల వైభవంతో దీపించే దివ్య తలాలతో క్రీడిస్తూ, దేవతలూ ఋషులూ చూసి, ఆనందంతో చిందులు వేశారు. ధ్యానంద్వారా తమ అవగాహనను త్వరితంచేయడానికి తేజస్సు ప్రసరింపజేయమని సవిత్రుని ప్రార్థించారు. సత్యం తమ కంటబడకుండా మరుగుపరచిన బంగారుపళ్ళాన్ని తొలగించవలసిందిగా పూషణ్ణి వేడు కొన్నారు. అంతేకాకుండా, సఅత్తునుంచి సత్తుకు, చీకటినుంచి వెలుతురుకు,

మర్త్యత్వంనుంచి అమృతత్వానికి తమను నడిపించవలసిందిగా ప్రార్థించారు. అటువంటి అమృతత్వానికి విశ్వమంతా బ్రహ్మమేనన్న దర్శనానికి వారసులైనవారి మహనీయదృష్టి ఈనాటికీ ప్రసరిస్తూనే ఉంది. అయితే చీకటి గుయ్యారాల్లో మరుగుపడి ఉన్నవారికి వెలుగు చూస్తే కళ్లు మిరుమిట్లు గొలుపుతాయి. ఆనందగీతం ఆగ్రహం తెప్పిస్తుంది.

మందలు మందలుగా బయటికి వచ్చారు
ముద్దగట్టిన మబ్బుల్లా, నడిరేయివేళ.
పొగలా వచ్చారు, విషంలా వచ్చారు.
మన చూపును అడ్డగించే పొగమంచులా వచ్చారు.
వాళ్లు మనని చుట్టుముట్టారు, సంశయబీజాలూ పాపబీజాలూ నాటారు.
కాని దాన్ని పట్టుకొని "ఔ, నదే" అన్నారు
లేనిదాన్ని పట్టుకొని "లేకేం, ఉంది" అన్నారు
మంచిని చెడ్డగా, చెడ్డను మంచిగా తారుమారుచేసి చెప్పారు.
ఇలా చెప్పినవాళ్లు, చాలామంది దానవులు —
అహి, వృత్ర, మార, కలి, అహ్రిమాన్, సాతాను.

అప్పుడు దేవదానవులకు యుద్ధం మొదలవుతుంది. ఇది ఎప్పటికి అంతమయ్యేను? క్షీరసాగర మథన వృత్తాంతాన్ని కొద్దిగా మెలివేసి, శ్రీకంఠయ్యగారు బాగా ఉపయోగించుకొన్నారు; విషాన్నే అమృతంగా మథించడం జరిగింది. ఒకప్పుడు భయంకరమైన రూపాలే ఇప్పుడు అందంగా అవుపిస్తున్నాయి. దానవులు స్నేహితులయ్యారు. యుద్ధానంతరం 'ధర్మనగరం' నిర్మించిన వాళ్లు దేవతలు, వాళ్లు మనకిచ్చే సందేశం "సత్యమే జయిస్తుంది, అసత్యం కాదు" అని.

లఘు రచనలు: శ్రీకంఠయ్యగారు 1936 లో కన్నడ ఛందస్సు సంగ్రహ చరిత్ర వ్రాశారు. ఆయిన అధికారికంగా వ్రాయగల విషయమిది. ఎందుచేతనంటే, ఆయన అంతకు పూర్వమే ద్రావిడ ఛందస్సుల్ని అధ్యయనం చేశారు. వాటిలో ప్రత్యేకించి కన్నడ, తమిళ ఛందస్సులు బాగా పరిశీలించారు. ఛందస్సుమీద ఆయన ఒకసారి గొప్ప ప్రతిభావంతమయిన ఉపన్యాసమివ్వడం నా కిప్పటికీ జ్ఞాపకం. అనేక భాషా సాహిత్యా

ల్లోంచి ఆయన విరివిగా ఉదాహరణ లిచ్చారు – సంస్కృతంలోంచి అనుష్టుప్పు, ఇంగ్లీషులోంచి హీరోయిక్ కప్లెట్, బ్లాంక్ వెర్స్, లిరిక్; కన్నడం నుంచి 'రగళె'. ఈ విషయాన్ని అధ్యయనం చేయదలిచినవాళ్ళకి ఆయన పుస్తకం బాగా ఉపయోగపడుతుంది.

ఈకన్నడ ఛందస్సు చరిత్ర, కన్నడ సాహిత్యచరిత్ర (అసంపూర్ణం) రెండూ 'కన్నడ కైపిడి' లో భాగాలు. కన్నడ సాహిత్య చరిత్రకు వ్రాసిన ఉపోద్ఘాతంలో ఈయన, ఏదో ఒక కారణంగా గుర్తింపుకు రావలసిన కొద్ది మంది కవుల్ని మాత్రమే ఎంపిక చేయడం జరిగిందని వ్రాశారు. "కన్నడంలో అంగీకారయోగ్యమైన విమర్శకవర్గం లేదు. మనవాళ్లు ఇప్పటికీ, మనం కొత్తగా కనుక్కొన్నవాటిని చూస్తూ ఆశ్చర్యపోయి విరివిగా పొగిడే దశలోనే ఉన్నారు. ఇది ఇలా ఉండగా, సంస్కృత సంప్రదాయాన్ని అధ్యయనం చెయ్యడంవల్ల ఏర్పడ్డ అభిరుచికీ, ఆంగ్ల సాహిత్యాన్ని అధ్యయనం చెయ్యడంవల్ల ఏర్పడ్డ అభిరుచికీ, చాలా భేదం ఉంది." కనక, విమర్శను పెంపొందించే కృషి ఎక్కువగా చెయ్యడానికి కాలం అనుకూలించ లేదని ఆయన అభిప్రాయపడ్డారు. ఈ సంగతి ఒప్పుకున్న తరవాత ఆయన చెయ్యదలచినది చేశారుకాదని ఆరోపించడం న్యాయంకాదు. కాని ఉదాహరణార్థం ఆయన తీసుకున్న భాగాల్లోనే విమర్శ ఇమిడి ఉంది. వివిధ సందర్భాల్లో ఆయన విమర్శకాభిప్రాయం స్పష్టంగా వ్యక్తమవుతుందికూడా. ఉదాహరణకు: "మొత్తానికి మనకిక్కడ కవికంటె తాత్త్వికుడే కనిపిస్తాడు." "ఇక్కడ రన్న నాటకీయతను విడిచిపెట్టాడు....నేలబారుగా వచ్చాడు. అయినా మెరుపులు మెరుస్తాయి, ఉరుములు ఉరుముతాయి." "ద్రౌపది సౌందర్యవర్ణన – అది ఇక్కడ అవసరమా?"

శ్రీకంఠయ్యగారి మూర్తిమత్వాన్ని అత్యధికంగా ఆవిష్కరించిన, అతి ముఖ్యమైన రచన 'కన్నడిగరిగె ఒళ్ళెయ సాహిత్య' (కన్నడిగులకోసం మంచి సాహిత్యం). ఆయన మరణానంతరం 1948 లో ప్రచురించిన ఈ సంపుటిలో, ప్రసంగాలు, పీఠికలు, సమీక్షలు ఉన్నాయి. ఆయన ప్రసంగాలు అనేకం గ్రంథస్థం కాలేదు. 'ప్రవక్తల భారం' వంటి అత్యుత్తమమైన ప్రసంగాలు కొన్ని, ఆ కారణంగా మనకు దక్కకుండాపోయాయి. ఈ సంపుటిలోని మొదటి అంశం 'ధార్వాడ ప్రసంగం'; దీన్ని గురించి

రెండో అధ్యాయంలో చర్చించడం జరిగింది. తక్కినవాటిలో కొన్ని, కన్నడిగుల్లో ఉన్న ఉదాసీనతను వదిలించి కార్యోన్ముఖులయేటట్టు ప్రబోధించడానికి వ్రాసినవి. కొన్నిటిలో పాకం, శైలి, పరభాషాపద ఆదానం మొ॥ వాటికి మార్గదర్శక సూచనలు ఇవ్వడం జరిగింది. సమీక్షలు, పీఠికలు, కర్నాటకంలోని కొందరు ప్రముఖుల ప్రశంసలు కూడా ఉన్నాయి. ఈ సంపుటిలో ఉన్న ప్రసంగాల్లో చాలావాటికి, ఆయన ప్రసంగించేటప్పుడు తీసిన షార్ట్‌హాండ్ నోట్సు ఆధారమని విన్నాను. ఆయన ఆమోదం పొందిన తరవాతే వాటిని ప్రచురించడం జరిగింది. మొత్తంమీద ఇవి సరళమైన కన్నడంలో ఉన్నాయి. అంటే బాగా చదువుకొన్న ఆధునిక కన్నడిగుడు మాట్లాడే భాషలో ఉన్నాయి. నాజూకుతనాన్నీ హుందాతనాన్నీ నిలుపుకొంటూనే, కృతకత్వాన్ని పరిహరించడం జరిగింది. కేవలం సంభాషణలో మట్టుకే వచ్చే వ్యావహారిక పదబంధాలు, ప్రాచీన కన్నడ కవిత్వం లోంచి ఉదాహరణలు, బైబిలులోంచీ ఇంగ్లీషు కవిత్వంలోంచీ ఎంచుకొన్న భాగాలకు అలవోకగా చెప్పిన అనువాదాలు, ఒకప్పుడు సున్నితంగా, మరొకప్పుడు ఘాటుగా ఉండే వెటకారం; సందర్భవశాత్తు వెలిగక్కే కోపదారితనం, మంచివాటినీ గొప్పవాటినీ హృదయపూర్వకంగా, ఉదారంగా ప్రస్తుతించడం, అన్నిటికన్న మిన్నగా, కర్నాటక భాషమీదా ప్రజలమీదా ఉన్న గాఢమైన ప్రేమ—ఈయన ప్రసంగాల్లో నిండి ఉండడమే కాదు, పెల్లుబుకుతూ ఉంటాయి కూడా. ఏదీ అసంగతంగా ఉండదు. అయితే ఒక్కమాట. ఈయనకు కూడా వ్యామోహస్పర్శ పూర్తిగా లేకుండా పోలేదు.

క్లాసులో పాఠం చెప్పేటప్పుడు ఈయన, చెప్పే విషయంలో లీనమయి ఉండేవారు కాని శ్రోతలమీద చూపు నిలిపేవారు కాదని వెనకే చెప్పాను. కాని బహిరంగ సభల్లో ప్రసంగించేటప్పుడు మాత్రం శ్రోతల్లో నిమగ్నులయేవారు. అలా అన్నంతమాత్రాన, శ్రోతలకు ఇంపుగా ఉండేదే చెప్పేవారని కాదు. శ్రోతల్లో ఎవరి ముఖంలోనో రవ్వంత అసంతృప్తి, అనంగీకారం, పొడచూపితే చాలు, బ్రహ్మాండంగా సాగుతున్న ప్రసంగం దెబ్బతిన్న సందర్భాలు కూడా కొన్ని ఉన్నాయి. ఆయన కేవలం శ్రోతల్ని సంతోషపెట్టటానికే మాట్లాడటమన్నది లేదు; కాని సాధారణంగా ఆయన మాట్లాడింది విని శ్రోతలు సంతోషించేవారు. ఆధునిక కన్నడంలోని కమ్మ

దనం ఈ ప్రసంగాల్లో పదిలపరచి ఉంది. ఉత్తరోత్తరా ఆయన వ్రాసిన వచన రచనల్లో శైలి ఎగుడుదిగుళ్లుగా, అర్థంకానంత గూఢంగా మారింది. ఇది వాడుక భాషకాదు. ఇలా వ్రాయడానికి కారణం, ఆయన ఏదో అసాధారణంగా వికార రూపాలు ప్రదర్శిద్దామన్న ఉద్దేశం కాదు. ఇందులో కృతకత్వం ఎన్నడూ లేదు. కాని చిక్కేక్కడంటే, ఈయన ఆలోచన వ్యక్తీకరణకంటె వేగంగా సాగిపోయేది.

# 5

## జ్ఞాపకాలు

రాజులు, తమకు ఏర్పరిచిన ఉన్నత స్థానాన్ని నిలుపుకొంటూ ఆ స్థాయిలో జీవించడానికి చాలా అవస్థపడేవారనుకుంటాను. కన్నడదేశం శ్రీకంఠయ్యగారిని గద్దెమీద నిలిపింది. ఆ స్థానాన్ని అలంకరించగలవారు ఆయనొక్కరే అన్నది స్పష్టం. కాని ఆ గద్దె కొంతవరకూ తమ ఉభయుల మధ్యా అవరోధమైందని ఆయనా, ప్రజలూ కూడా త్వరలోనే గుర్తించారు. సాధించిన స్థానానికి ఆయన అంతగా విలువ ఇచ్చి ఉండకపోతే ఆయనలో మానవీయత ఇంకా గోచరించి ఉండేది. ప్రజలపట్ల తాను చూపిన ప్రేమకు ప్రజలు కూడా తనమీద ప్రేమ చూపించడం, తాను వాళ్ళకు చేసినదానికి ఎంతో విలువ ఇవ్వడం జరిగిందనుకోడం ఆయనకు తృప్తి కలిగించలేదు. ఆ స్థానంలో ఉండి కన్నడానికి ఇంకా కొంత సేవ చెయ్యగలనని అనుకునే వారు. అయినా ఆ స్థానంలో ఆయన సుఖపడలేదు. గద్దెకు దగ్గరగా ఉన్న కొద్దిమంది మాత్రం ఆయన దగ్గర స్వతంత్రంగా వేళాకోళాలాడుతూ ఉండే వారు. అలాటి వాటిల్లో శ్రీకంఠయ్యగారు కూడా సరదాగా కలిసే వారని డా॥ డి. వి. గుండప్ప వ్రాశారు. ఆయనదంతా రాజసమని చాలా మందికి ఏర్పడ్డ అభిప్రాయం. ఆ సంగతి శ్రీకంఠయ్యగారికి తెలియక పోలేదు. దానివల్ల ఆయన అసంతుష్టి చెందారు.

ఆయన సాయిలా పాయిలాగా ఉన్న సందర్భాలు రెండు మూడు నాకు తెలుసు. నేను 1942లో షిమోగా కాలేజిలో పనిచేస్తుండేటప్పుడు, శ్రీకంఠయ్యగారు అక్కడి ఇంగ్లీషు డిపార్ట్‌మెంటును తనిఖీ చెయ్యడానికి రావలసి ఉంది. ఆ సందర్భంలో వచ్చినప్పుడు మాఇంట్లో ఉండవలసిందని కోరుతూ, చనువు తీసుకొని ఆయన్ని ఆహ్వానించాను. నాకు తెలుసు. నాకంటె ప్రముఖులు కనీసం అరడజనుమంది అయినా ఆహ్వానించి ఉంటా రని. నా ఆహ్వానాన్ని మన్నిస్తూ తిరుగుటపాలో వచ్చిన ఉత్తరం చూసి నప్పుడు ఆశ్చర్యమూ కలిగింది, సంతోషమూ కలిగింది. ఈ విధంగా మేమిద్దరం రెండు రోజులు కలిసి ఉండే అవకాశం కలిగిందన్నమాట. అదొక అపురూపమైన అనుభవం. మొదటి పది, పదిహేను నిమిషాలూ మేము వ్యాకరణబద్ధమైన అధ్యాపన స్థాయి ఆంగ్లభాషలో ప్రశ్నోత్తరాలు జరుపుకొన్నాం. ఇంతలో మాలో ఒకరు—ఎవరో నాకు గుర్తులేదు కాని— కన్నడంలోకి దిగడం జరిగింది. కొద్ది నిమిషాల్లో వాతావరణం మారి పోయింది. మధ్యాహ్నం భోజన సమయానికి మేము ఎంత కులాసాగా మాట్లాడుకున్నామంటే, విద్యాసంబంధమూ సాహిత్య సంబంధమూ ఏమాత్రం లేని విషయాలు—అరిటాకులో భోంచెయ్యడానికీ వెండికంచంలో భోంచెయ్యడానికీ గల తేడా వంటివి చర్చించుకున్నాం.

ఆ సాయంత్రం ఒక పడుచువాడు— అతను నాకూ, శ్రీకంఠయ్య గారికీ కూడా శిష్యుడే—ఆయన్ని చూడ్డానికి వచ్చాడు. అతను చాలా బెరుకుగా, బింకంగా ఉండడం చూసి శ్రీకంఠయ్యగారు చిరునవ్వు నవ్వారు; "పి—, మనం కొంచెం మర్యాద తగ్గించి, మరికొంచెం చనువుగా మాట్లాడు కోవచ్చు'' అన్నారు. మా చర్చ 'అశ్వత్థామన్' మీదికి మళ్ళింది. పి—, ఆ నాటకంలో, ఒకటి రెండుసార్లు నటించాడు. కొన్ని వారాలకిందట నేను ఆ నాటకాన్ని చదివి వినిపించినట్టు కూడా అతడు చెప్పాడు. శ్రీకంఠయ్య గారు నాకేసి వేలెత్తి చూపిస్తూ అన్నారు: 'అతన్ని చూడు, పి—, అతను నా శిష్యుణ్ణని చెప్పుకుంటాడు. మళ్ళీ, నేను చేసిందానికి వ్యతిరేకంచేస్తాడు.'' నేను తికమకపడ్డాను. ఆ మాటే అన్నాను. అప్పుడాయన వివరంగా చెప్పారు. "నేను అశ్వత్థామన్‌ని చంపాను. చావులేనివాణ్ణి చంపడం ఒక పనేకదా. ఇప్పుడితను, అశ్వత్థామన్‌ని బయటికి లాగుతున్నాడు.''

ఆయన తేలికగా అనే మాటల్లో కూడా కొంత బరువు ఉంటూ ఉండే దనుకుంటాను 'అశ్వత్థామన్' గురించి ఆయన పై మాటలు అన్నప్పుడు దానిమీద వచ్చిన వివాదం ఆయన మనస్సులో ఉందనుకుంటాను. మరో సందర్భంలో అలాటి బరువేమీలేదు. ఒక చిన్న ఊళ్ళో, స్థానిక కన్నడ సంఘం వాళ్ళ వార్షికోత్సవంలో పాల్గొనడానికి మేము రహదారి బంగళాలో మకాం చేశాం. మాలో ముగ్గురం బట్టలు వేసుకుని బయటికి బయలుదేర డానికి సిద్ధంగా ఉన్నాం. నాలుగో వ్యక్తి — శ్రీకంఠయ్యగారి పూర్వ విద్యార్థి — మరో అరగంటదాకా తెమలలేదు. మేము అతనికోసం కాసుకుని ఉన్నాం. శ్రీకంఠయ్యగారికి ఓర్పుతగ్గి, చాలా చిరాకుపడతారనుకున్నాను. కాని ఆయన చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నారు: "రా, గుమ్మానికి ఇటూ అటూ ద్వారపాలకుల్లా నిలబడి సుప్రభాతం పాడదాం. మొదలెట్టు: "ఏళయ్య బెళగాయితు (లే, తెల్లవారింది.)"

ఈ అక్షర రాజ్యాధిపతి తన అధీనులకు స్వచ్ఛందంగా క్షమార్పణలు కూడా చెప్పుకోగలడు. కన్నడ సాహిత్య పరిషత్తుకు ఉపాధ్యక్షులుగా ఉండే రోజుల్లో ఈయన, 'కర్నాటక' అన్న పదంలో ఉన్న వర్ణక్రమం మార్చాలని దంత్యనకారానికి బదులు మూర్ధన్య నకారం—'ణ' చేర్చాలని) సూచించారు. అప్పుడు పరిషత్తు భవనంలోనే ఏర్పాటయిన ఇంగ్లీషు—కన్నడ నిఘంటు కార్యాలయంలో పనిచేసే ప్రొఫెసర్ కె. వి. రాఘవాచార్‌గారు చాలా మర్యాదగా ఇలా అన్నారు: "అయ్యా! పరిషత్తు రిజిష్టర్ అయిన సంస్థ. రిజిస్ట్రేషన్ కాయితాల్లో ఏ పదం మార్చాలన్నా సర్వసభ్య సమావేశంవారి ఆమోదం పొందితేనే కాని మార్చడానికి వీలులేదు." ఆ యువకుడి సాహసానికి ప్రతి ఒక్కరూ ఆశ్చర్యపోయారు. శ్రీ కంఠయ్యగారు ఏమీ చెప్పలేదు, అయినా ఆయన నిరుత్సాహపడ్డట్టు కనిపిస్తూనే ఉంది. కొన్ని నెలలు గడి చాయి. శ్రీకంఠయ్యగారి ప్రత్యర్థులు దీన్నొక పెద్ద వివాదంగా తీసుకుని రాద్ధాంతం చేశారు. ఒకనాడు పొద్దున శ్రీకంఠయ్యగారి కారు రాఘవాచారి గారి ఇంటిముందు ఆగింది. డ్రైవరు ఒక చీటీతెచ్చి ఇచ్చాడు. "మిమ్మల్ని కలుసుకోవాలనుకుంటున్నాను. మీకు తీరికగా ఉంటే, ఒకసారి రమ్మని నా కోరిక. మీ కోసం కారు కాసుకొని ఉంటుంది." వాళ్లు కలుసుకోగానే శ్రీకంఠయ్యగారు చేసిన మొట్టమొదటి పని ఏమిటంటే, "మీరన్నది రైటు;

నాదే తప్పు. ఆ రోజు మీరు అభ్యంతరం చెప్పినప్పుడు, అనవసరంగా గొడవ చేస్తున్నారనుకున్నాను. మీకు చేసిన అన్యాయానికి క్షమార్పణ చెప్పుకుంటున్నాను" అన్నారు.

ఆయనకున్న రాజభక్తిని నాలాటి యువకులం ఒప్పుకునేవాళ్ళం కాము. బ్రిటిష్‌వాళ్లు భారతదేశాన్ని ఆక్రమించుకోడంవల్ల చాలా మేలు కలిగిందని మనం ఒప్పుకున్నప్పటికీ, భారతదేశాన్ని ఏకీకరణం చేశారన్న ప్రతిష్ఠ, ఆయన వాళ్ళకు ఇచ్చి ఉండవలసిందికాదు. దేశాన్నంతనీ ఒక్క పాలనకిందికి తెచ్చారన్నది తప్పకుండా నిజం. వాళ్లు వెళ్ళిపోయిన తరవాత అది ముక్కలు చెక్కలయి, మనవాళ్ళు ఒకరితో ఒకరు కుమ్ములాడుకుని ఉండేవారు. ఇంగ్లండులో కొన్ని మొంటిఘటాలు ఇలానే అనుకునేవి – అనుకోడమేమిటి? బహుశా ఆశించేవికూడా. భారతదేశాన్ని సమైక్యంచేసిన ప్రతిష్ఠ, కాలక్రమాను సారంగా, చెందవలసినవారు — స్వామీ వివేకానంద, రవీంద్రనాథ్ టాగూరు, మహాత్మాగాంధీ. కాని మనం అటువంటి సమస్యల్ని, కాలగమనంలో కీలకస్థానంలోంచి చూస్తున్నామన్న విషయం మరిచిపోగూడదు. అంతేకాకుండా, ఆయన జీవితాన్ని ధారపోసింది రాజకీయరంగానికి కాదని కూడా మరిచిపోగూడదు. ఏర్పరుచుకున్న పరిధికి లోబడి ఆయన చేసిన కృషి, పైన పేర్కొన్న జాతీయనాయకులు ఆమోదించే ఉండేవారు. కర్నాటకంలో ప్రాథమిక రాజకీయ సమైక్యం సాధించడానికి ప్రజల్లో సమైక్యభావం పెంపొందించడానికి కృషిచేసి సఫలీకృతులయారాయన. కొన్ని ప్రసంగాల్లో ఆయన ప్రబోధించిన మతసహనాన్ని గాంధీగారు హృదయపూర్వకంగా సమర్థించి ఉండేవారు. సాహిత్య, సాంస్కృతిక విలువల్ని గురించి ఆయన చెప్పినవి ఈనాటికీ చెల్లుతాయి. తరవాతి సాహిత్యంమీద శ్రీకంఠయ్యగారి ప్రభావాన్నిగురించి, ఆయన శిష్యుడూ కన్నడ రచయితల్లో ప్రముఖుడూ శ్రీ మాస్తి వెంకటేశం అయ్యంగార్ చెప్పినది అక్షరాలా నిజం, "ఈ నాడు కన్నడ కవిత్వంలో వినిపించే మధురస్వరాలన్నిటికీ మూలం (ప్రత్యక్షంగానో, పరోక్షంగానో) శ్రీకంఠయ్యగారి ఒరవడి, అభ్యాసం".

ఒకప్పుడు నిర్జనంగా ఉండే కన్నడ సాహిత్యవీథులు ఈనాడు, ఆయన కన్న కలకన్నకూడా మిన్నగా, జనసమర్దంతో నిండిఉన్నాయి. ఆయన నడిపిన కాల్పనికోద్యమం తిరోగమించింది. నూతన ఉద్యమాల

నాయకులు ఆయన గొప్పతనాన్ని, మన ప్రజలమీదా సాహిత్యంమీదా ఆయనకుగల గాఢమైన ప్రభావాన్నీ నిస్సంకోచంగా అంగీకరిస్తారు. పాతవాటి మీద ఆయన చేసిన తిరుగుబాట్లే కొత్త తిరుగుబాట్లకు అవకాశమిచ్చాయి. ఒకప్పటి విప్లవకారుణ్ణి కాలం మితవాదిని చేస్తుంది. మళ్లీ కొత్తకొత్త విప్లవకారులు బయలుదేరతారు. శ్రీకంఠయ్యగారు ఇలా అని ఉండేవారు: "అలాగే కానీండి. ఒక మంచి ఆచారం ప్రపంచాన్ని భ్రష్టు పట్టించగూడదు."

## ఆకర గ్రంథాలు

### శ్రీకంఠయ్యగారి రచనలు

1. A Handbook of Rhetoric (English)
2. ఇంగ్లీషు గీతగళు.
3. గదాయుద్ధ నాటకం.
4. అశ్వత్థామన్.
5. పారశీకరు
6. కన్నడద బావుటా (సంపాదకత్వం).
7. కన్నడ సాహిత్య సంగ్రహ చరిత్ర (కన్నడ కైపిడిలో విభాగం III)
8. హొంగన సుగళు.
9. కన్నడిగరిగె ఒళ్ళెయ సాహిత్య (ప్రసంగాలూ పీఠికలూ).
10. కన్నడ సాహిత్య చరిత్ర (కన్నడ కైపిడిలో విభాగం II).
11. ఇస్లామ్ సంస్కృతి (అనువాదం).

# శ్రీకంఠయ్యగారిమీద, ఆయన రచనలమీద

## ఇంగ్లీషులో

1. ఎస్. వి. రంగణ్ణ, బి. ఎం. శ్రీకంఠయ్య.

## కన్నడంలో

1. మాస్తి వెంకటేశ అయ్యంగార్ (సంపా.), సంభావనె శ్రీకంఠయ్యగారి 58 వ జన్మదినోత్సవంనాడు బహూకరించినది. ఇతర విషయాలతో బాటు శ్రీకంఠయ్యగారిమీదా, ఆయన రచనలమీదా వ్రాసిన వ్యాసా లున్నాయి).
2. వి. సీతారామయ్య, అశ్వత్థామన్.
3. ఎన్. అనంతరంగాచార్, అశ్వత్థామన్.
4. డి వి. గుండప్ప, సాహిత్యోపాసకరు (బి. ఎం. శ్రీకంఠయ్యగారి మీద ఒక అధ్యాయం).